


లో అత్యధికంగా కొని చదువబడుతున్న ఏకైక తెలుగు మాసపత్రిక!

అక్టోబరు '83

4 రూ/-

# Special offer on MRF Scooter/ Motorcycle tyres

This handy
Tyre Pressure Gauge
for only Rs. 10/-*

MRF Tyres are built to ride on and on But over inflation or under inflation of tyres hurts them and shortens their life Now, with this Tyre pressure gauge, you can check the tyre pressure yourself!

When you buy MRF two wheeler tyres, get your tyre pressure gauge from the dealer at a special price of Rs 10/- along with your guarantee card

Hurry! Offer open from 1st August until stocks last






Offer open in — Madras, Bangalore, Trivandrum Quilon, Kottayam, Calicut, Ernakulam, Secunderabad/Hyderabad

* Local taxes extra

MRF tyres are also available without this offer

LINTAS (M) MRF-TW-A-181

స్థాపకుడు
వి.వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 21 అక్టోబర్ 83 సంచిక 9

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

## ఆవలితీరం

సదానంద్ శారద

జ్యోతి-భాగ్యలక్ష్మి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన నవల

జ్యోతి పి. బి. నెం. 1824, హైదరాబాద్-20

జయసుధ ముఖచిత్రం

ఈ మధ్య ముఖ చిత్రాలు చాలా ఆకర్షణీయంగా వుంటున్నాయి। "జ్యోత్స్న ఇలియాస్" గారి "ఆక్రందన" కధ మమ్మల్నెంతగానో ఆకర్షించింది కధ కోసరం యెన్నుకొన్న థీమ్, కధలోని శైలీ పాత్రల చిత్రీకరణ వైవిధ్యంతో కూడి వున్నాయి పాలకోడేటి సత్యన్నారాయణ గారి ''లోయలూ - శిఖరాలూ" నవల బావుంది కానీ నవలకూ పేరుకూ పొత్తు కుదరలేదు.

సుజయశ్రీ, ఆదోని.




శ్రీయర్రంశెట్టిశాయిగారి కథానిక ''వమ్మేలువద్దు" (హ్యూమరాలజీ-8) చాలాబావున్నది. నేటి దేశ పరిస్థిని దానిపై యెదుర్కొంటున్న ప్రజల ఇబ్బందిని కళ్లకట్టినట్లు వివరించారు రచయితగారు. ఇంత చక్కటి కథానికను అందించిన "జ్యోతి" కి నాయొక్క హృదయ పూర్వక అభినందనములు

శ్రీమతి [illegible]మ్మి

నవ్వుల పువ్వుల విరజాజి, హ్యూమరాలజి; ఈ నెలంతా నవ్వుకునేలా....ఆహ్లాదంగా .... అద్భుతంగా ఉంది।

అత్యంత వాస్తవికంగా-సహజంగా వ్రాసిన యర్రంశెట్టిగారికి అభినందనలు-అదలా ఉంచండి - పోస్టల్ సిబ్బంది లైటినింగ్ స్ట్రైయిక్ చేసి, అనక ఈ ఉత్తరం మీకు అందక పోతే అది నా తప్పుగాదు.

పి. యల్-వర్చస్వి
హైదరాబాద్

నమస్కారం

ఆగష్టు 83 సంచికలో హ్యూమరాలజీ-7 చూసింతరువాత

''ఆకాశవాణీ। పాపం మా యర్రం శెట్టిశాయిగారికి కూడా జనరంజని సమర్పించే ఛాన్సివ్వు.

....కర్లపాలెం హనుమంతరావు
విజయవాడ

★ సమాధానం:

అయ్యా హనుమంతరావుగారూ,

పాపం, నాకూడా ఆకాశవాణి జనరంజని సమర్పించే ఛాన్సిచ్చింది సార్. ఆఛాన్స్‌ని అనుభవించే సమయంలోనే "జనరంజని" కథలోని అద్భుతాలు జరిగాయ్ కనుక ఇది మరీ గొప్పతిగా కట్టుకథ కాదండీ. నేను యెంతో జాగ్రత్తగా, మంచిపాటలను కున్నవి ఏరి ఇస్తే, ఆ పాటలు లేవు పొమ్మన్నారు. ఒకవేళ ఉంటే వేస్తాం అన్నారు. ముఖ్యంగా ఈ పాటల విషయంలోనే నాకు చిరాకు పుట్టుకొచ్చింది.

1) అందమె ఆనందం
2) చిగురాకులలో చిలకమ్మా
3) ఏటికేతంకట్టి
4) మల్లియలారా-మాలికలారా—

ఇవి వేయడం జరగలేదు

సరేపోసీ నిజంగా ఆ రికార్డులు లేవేమో, మరీపాతబడి పోవడంవల్ల వేయలేదేమో అనుకున్నాను. కానీ. ఆమర్నాడు రాత్రిలోగా ఆ మూడు పాటలూ ఝామ్మని వివిధ భారతిలో వినిపించాయ్. అలాగే నేను మాట్లాడిన




మాటలు ఇష్టం వచ్చినరీతిలో కట్‌చేసేయడం. నేను వద్దన్న చెత్తపాటలు వేయడం, ఇలాంటి అద్భుతాలు చాలా జరిగాయ్ ఆ ప్రోగ్రామ్‌లో. కనుక, మీరు నన్ను చూసి జాలిపడకండి. ఇంతటి వింతలు, విడ్డూరాలు నిర్వహిస్తోన్న మన 'వివిధ భారతి'ని చూసి జాలిపడండి- నేనూ మీకు కంపెనీ ఇస్తాను

యర్రంశెట్టిశాయి

○ ○

# ఎండవల్ల ఎల్లప్పుడూ నల్లబడుతూనే వుంటే
# ఎలా వచ్చేను తెల్లదనం-ఎరుక సేయవే ఓ మనసా!

[illegible] [illegible] శరీరతత్వాల ప్రకారం, [illegible] [illegible]వగానో. శరీరం క్రమంగా నల్లబడుతూనే ఉంటుంది. [illegible] [illegible] [illegible] [illegible]-చర్మం లోపలగల నల్లని రంగు పదార్థం '[illegible]'.



[redacted]

# కేవలం ఒక్క డెట్ బిళ్లలోనే
# వుంది సాల్వెంట్ పవర్

## బట్టలను అన్నిటికంటే ఎక్కువ తెల్లగా ఉతుకుట కొరకు

క్రొత్త
సాల్వెంట్
పవర్

NEW SOLVENT POWER
det
detergent washing cake

జిడ్డును తీసివేసే,
మురికిని తొలగించే మరియు
మిరమిట్ల తెలుపును
ఇచ్చే శక్తి



**మరే ఇతర డిటర్జెంట్ బార్ లేక బిళ్ల దీనికి సాటి రాదు**



# కార్టూన్ పోటీ ఫలితాలు

| | |
|---|---|
| మొదటి బహుమతి | శ్రీ చంద్ర |
| రెండవ బహుమతి | " బాచి |
| మూడవ బహుమతి | " ఈశ్వర్ |

కన్సొలేషన్ బహుమతులు

శ్రీయుతులు 1. ప్రసాద్ కాజ
2. బి. యస్. రాజు
3. డి శ్రీనివాసరావు (దాసరి శ్రీను)
4. చంద్ర (రెండు కన్సొలేషన్ బహుమతులు)
5. జి. ఎల్. వి. రమణగుప్త
6. ఎస్. వి. రమణారావు (అరుణ్)
7. శేఖర్ (రెండు కన్సొలేషన్ బహుమతులు)
8. శ్రీపల్లి

# తీర్పు గురించి

సినిమాల్లో జడ్జివేషం చుసి, చిన్నప్పుడు నేను జడ్జి అవాలి అనుకునే వాడిని. ఆ కోరిక తీరలేదుగదాని బాధపడుతుంటే "జ్యోతి" ఎడిటరుగారు జాలి పడి సరే మా కార్టూన్ల పోటీకి జడ్జిగా ఉండమన్నారు. ఎగిరిగంతేసి ఒప్పుకు న్నాను. జ్యోతి "కార్టూన్ పోటీ" కొచ్చిన కార్టూన్లు చూస్తుంటే నవ్వాలో ఏడవాలో తెలీలేదు. అఫ్ కోర్స్, సబ్జెక్ట్ "మనదేశ రాజకీయపర్వం" గనుక, మరి మన రాజకీయాలు చూస్తే ఎవరికయినా ఏడుపూ, వాంతులూ కలగటం సహజం గనుక ఆ సబ్జెక్ట్ కార్టూన్లు కూడా ఆ భావాలే కలిగిస్తాయనుకొంటే-పేచీలేదు,




మొదటి బహుమతి పొందిన కార్టూన్

కొన్ని కార్టూన్లు అసలు పత్రికకి సంబంధించినవి కావు. ఏవేవో సోషల్ ప్రాబ్లమ్స్ మీద వేసినవి. మరికొన్ని డైరక్టుగా ఇందిరాగాంధి, యన్. టి. ఆర్.ల మీద కొంచెం ఎక్కువ మోతాదులో వేసినవి ఇవన్నీ ఫర్లేదుగాని నాకు అస్సలు నచ్చని కార్టూన్లు కొన్ని ఉన్నాయి. నచ్చని కారణం...నాలుగయిదు పొడుగాటి లైన్ల కాప్షన్ ఉత్తమమైన కార్టూన్ అంటే ఏ కాప్షనూ లేనిదని చాలామంది పబ్లిగ్గానే స్టేట్ మెంటిచ్చారు. ఒకవేళ కాప్షన్ ఉన్నా వీలయినంత తక్కువ పదాలతో ఉంటే బావుంటుందని కూడా వాళ్ళే అన్నట్టు గుర్తు. కార్టూన్ల గురించి పెద్దగా అభిప్రాయాలు వెలిబుచ్చేంత నాలెడ్జి నాకు లేదుగానీ-పై అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను.

ఎటొచ్చీ నాకు చాలా ఆనందం కలిగించిన విషయం ఏమిటంటే పోటీకి వచ్చిన కార్టూన్ల సంఖ్య! సంఖ్య పెరిగితే తప్పక "వాసి" కూడా పెరుగుతుందని నాకో దురభిప్రాయం ఉంది. మరి చూడాలి భవిష్యత్తులో ఏం జరుగుతుందో.

యర్రంశెట్టి శాయి

# ప్రేమలేఖ

## యెలిశెట్టి శంకర రావు

"విజయనగరంనుంచి శ్రీకాకుళం పోయే సూపర్ డీలక్స్ ఐదవ నంబరు ప్లాట్‌ఫాంపై సిద్ధంగా నున్నది" మైకులో అనౌన్సర్ గొంతు రెండుసార్లు వినిపించి వడివడిగా నడిచి బస్సులో కూర్చున్నాను కిటికీ దగ్గర్నుంచి బ్రీఫ్ కేస్ అందించాడు రవివర్మ.

బస్ స్టార్టయ్యింది డ్రైవరు హారన్ కొడుతున్నాడు. "గుడ్‌లక్ రవీ. ఐ విష్ యూ ఫర్‌వ్వీ సక్సెస్ ఇన్ ఫ్యూచర్" చెప్పాలనుకున్న మాటలు గొంతులోనే ఆగిపోయాయి

వెళ్ళొస్తానన్నట్టు కళ్ళతోనే చెప్పాను.

అతని కళ్లు తడిగా మెరిసాయి.

బస్సు నెమ్మదిగా కదిలింది,

హఠాత్తుగా జేబులోంచి ఓ ఉత్తరం తీసి నా కందించాడతను. అప్రయత్నంగా అందుకున్నాను.

ఉత్తరం నా చేతికందించి రవివర్మ వడివడిగా నడిచి వెళ్ళిపోతున్నాడు.

నా హృదయ స్పందన జోరవటం నాకు స్పష్టంగా తెలుస్తోంది. రవి వెళ్తున్న వైపే తదేకంగా చూస్తుండిపోయాను. వెళ్తున్న వాడల్లా ఆగి వెనుగ్గా నావైపు చూశాడు రవి.

గాలికి చెదిరిన జుత్తు ఫాల భాగం పైన చిందర వందరగా పడుతోంది. తెల్లని పాలబుగ్గలు ఎరుపు రంగుకి తిరిగాయి. "ఇరవై ఏళ్లు" వయసున్న అతని కళ్లు పసివాడి కళ్లలా స్వచ్ఛంగా నిర్మలంగా మెరుస్తూ క్రమంగా నాకు దూరమైపోయాయి.

చేతిలో రవివర్మ ఉత్తరం నన్ను చూసి నవ్వినట్టనిపించింది.

ఏంటిది? అతను నాకెందుకు ఉత్తరం రాసాడు? ఏం ఉండి ఉంటుంది ఉత్తరంలో? చిందర వందరగా ప్రశ్నలు క్షణకాలం నన్ను తత్తరపాటులో ముంచిన ఊహ

ప్రేమలేఖా..?

నా స్త్రీత్వం "ముప్పయి మూడేళ్ళ" వయసు ఒక్కసారి తుళ్ళిపడ్డాయి.

ఉత్తరం చదవమని మనసు చేస్తున్నా కొంతవని ఏదో తెలియని భయం కాదనేలా చేసింది. ఉత్తరం పక్కకి పడేసి సీటుకు చేరబడి అలసటగా, అసహనంగా కళ్లుమూసుకున్నాను.

అస్పష్టంగా నన్ను చుట్టుముట్టుతున్న గతం!

నాన్నగారు వదిలిపోయిన ఆస్తిని పొదుపుగా వాడుతూ కరుణక్కయ్యనీ, నన్నూ చాలా శ్రద్ధగా పెంచింది అమ్మ. మా ఇద్దరికీ చదువులు చెప్పించింది. కరుణక్కయ్య బి ఎస్సీ చదువుతుండగానే సుధాకరం అనే ఇంజనీరుతో అక్కయ్య పెళ్ళయిపోయింది నేను ఎమ్మే చదవటానికి యూనివర్సిటీకి వెళ్ళిపోయాను.

యూనివర్సిటీలో ఉండగానే తెలిసిన ఓ విషాద సంఘటన నా మొత్తం జీవితానే మార్చి వేసింది.

సుధాకరం బావ అక్కయ్యను తన అంతస్థుకు తగినంత కట్నం తేలేదనే సాకుతో రోజూ హింసించే వాడట. అలా హింసపెట్టి ఓ రోజు యాసిడ్ పోసి క్రూరంగా, ఘోరంగా అక్కయ్యను చంపేసాడు.

నాకు పెళ్ళి, మగవాళ్లు అంటేనే అంతరంగంలో అసహ్యంగా ముద్ర పడి మిగిలిపోయాయి.

సైకాలజీలో ఎమ్మే పూర్తిచేసి లెక్చరర్‌గా జాయినయ్యాను విశాఖపట్నంలో, మూడేళ్ళ క్రిందట విజయనగరం కాలేజీకి ట్రాన్స్‌ఫరయ్యింది

ఫస్ట్ ఇయర్ బియ్యే స్టూడెంట్స్‌కి మొట్టమొదటిసారిగా క్లాసుకు వెళ్లాను.

క్లాసు రూంలో అడుగుపెట్టగానే నాలుగు కాగితం రాకెట్లు మీద పడ్డాయి. క్లాసంతా నవ్వులు "మేడమ్" బావనా, క్రోయ్, ఎంచక్కా హిందీ ఏక్ట్రెస్‌లా ఉన్నారు!" ఏవేవో కామెంట్స్ వినబడుతున్నాయి.

ఇలాంటి కామెంట్స్ వినేప్పుడు చాలా బాధగా ఉంటుంది నాకు స్టూడెంట్సందరూ చిన్నపిల్లల్లాగే కనిపిస్తారు నాకు.

అలవాటయిన సహనంతో "థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్ మైడియర్ స్టూడెంట్స్. ఐయామ్ ఉషోదయా, ఎమ్మే సైకాలజీ లెట్ మీ నో యువర్ గుడ్‌నేమ్స్" మంద్రస్థాయిలో అనేసరికి క్లాసులో అల్లరికొంచెం సద్దుమణిగింది. అందరి పేర్లూ తెలుసుకున్నాను.

అప్పుడే మొట్టమొదటిసారి రవివర్మ వైపు పరిశీలనగా రెండు క్షణాలు చూసాను.

ఆ సమయంలో అంతనంటే నాకు జాలి కలిగింది.

ఎందుకంటే....?

o o o




రెండవ బహుమతి పొందిన కార్టూన్

---

మరసటి రోజు పాఠం చెప్పటం మొదలు పెట్టాను. "లెటజ్‌నో ఎబౌట్ స్కిజో ఫ్రెనియాక్. స్కిజోఫ్రెనియాక్ ఈజ్ ఎ స్ప్లిట్ ఆర్ డివైడెడ్ పరసనాలిటీ, హీ లాసెస్ కాంట్రాక్ట్ విత్ హిజ్ ఎన్విరాన్‌మెంట్, లివ్స్ ఇన్ ఎన్ అన్‌రియల్ వరల్డ్ ఆఫ్ హిజ్ ఓన్ మేకింగ్ ఎండ్ ఆఫెన్ ఇమేజిన్స్ హి ఈజ్ సమ్ వన్ ఎల్స్...." చెప్తూ ఆగాను. ఎంతవరకూ స్టూడెంట్స్ నన్ను ఫాలో అవుతున్నారో తెల్సుకుందా మనిపించింది.

"ఎనీ డౌట్స్?" అందరివంకా కలియచూస్తూ అడిగాను. "ఓన్లీ వన్ డౌట్ మేడమ్, ఇంకా బెల్ కావటానికి ఎంత టైముందండీ?" ఎవర్రో కోణంగి ప్రశ్నించాడు. క్లాసంతా నవ్వుల్లో మునిగిపోయింది. నేను నవ్వును లోలోపలే అణుచుకుని ఎందుకో రవి వర్మ వైపు చూసాను.

అతను నవ్వటంలేదు.

నావైపే చూస్తున్నాడు కుతూహలంగా.

o o o

"ది మేలన్ కోలియాక్ హేజ్ ఫాలెన్ ఇన్‌టు ఎ ఫిక్స్‌డ్ కండిషన్ ఆఫ్ డిస్పాండెన్సీ హి ఆఫెన్ థింక్స్ ఆఫ్, ఆర్ ఎటెంప్ట్స్ సూసయిడ్...."

"అబ్బా!" ఎవరో స్టూడెంట్ మూలగటంతో చెప్తున్న పాఠం ఆపి ఏమయ్యిందని విసుగ్గా ప్రశ్నించాను.

"తలనొప్పి మేడం" అన్నాడో స్టూడెంట్ లేచి దిక్కుమొకంతో "ఒక సారిడన్ వేసుకుని, టీ తాగరా" సలహా ఇచ్చాడు ఓ సలహారావు "నా దగ్గర డబ్బుల్లేవురా" తలనొప్పబ్బాయి

చెప్పాను "మేడమ్ని అడుగు. తిరిగి రేపిచ్చేద్దువులే" ఉచిత సలహా చెప్పాడు సలహాల్రావు

పర్స్ తెరిచి చూశాను. చిల్లరలేదు, యాభై రూపాయలనోటు తీసి తల్లొప్పబ్బాయి కిస్తూ 'మిగతా చిల్లరలెచ్చియ్యి' అన్నాను.

"మిగతా చిల్లర రాదు మేడం అర్జంటుగా మా అందరికీ తలనొప్పులొచ్చేసాయి" అనిచెప్పేసి అందరూ పోలోమని లేచి వెళ్ళిపోయారు. పది నిమిషాలు పోయిం తర్వాత నాకూడా ఓ టీ పంపించారు గౌరవంగా. ఒక్కడే ఆఖరు బెంచీలో కూర్చున్న రవివర్మ నావైపు చూసి తమాషాగా నవ్వాడు. నాకూడా నవ్వొచ్చింది.

o o o

వీళ్ళతో ఇలాకాదని సైకలాజికల్ ట్రీట్మెంట్ ... "మీ అల్లరి చూసి నేనేం భయపడ్డంలేదు. జాలిపడుతున్నా. ఎంతే ఇంట్లో తల్లిదండ్రుల ఆదరణ నోచుకోని పిల్లలే బయట ఎక్కువగా అల్లరి చేస్తారు. సైకాలజీ ప్రకారం"

ఆవేళ క్లాసులో అలా చెప్పిన తర నా మాటలు వాళ్ళని ఏమైనా ఇన్స్పైర్ చేసాయో లేక నా మీద జాలిపడ్డారో తెలియదుగాని తర్వాత రోజుల్లో నా స్టూడెంట్స్ మోస్ట్ ఒబిడియంట్ స్టూడెంట్స్గా మిగిలిపోయారు.

ఒక్క రవివర్మ మాత్రం స్ప్లిట్ పర్సనాలిటీగా మిగిలిపోయాడు.

రోజూ డిపార్టుమెంటుకు వచ్చి నా దగ్గరికి వచ్చి పాఠాలు చెప్పించుకునే వాడు, చాలా శ్రమపడి అతనికి చెప్పి నోట్సు ప్రిపేర్ చేసి ఇచ్చేదాన్ని. కాలేజీ ఉన్న ప్రతిరోజూ అతను ప్రత్యేకంగా నా దగ్గరకు వచ్చి విష్ చేసి వెళ్ళేవాడు. నన్ను చూసినప్పుడల్లా అతని కళ్ళలో కలిగే వెలుగును గమనించాను.

ఒకసారి మూడ్రోజులపాటు జ్వరం తగిలి కాలేజీకి వెళ్ళలేక సెలవుపెట్టాను. రెండవరోజు ఇంటికి వచ్చాడు రవివర్మ. నన్నుచూసి అప్పటికప్పుడే డాక్టర్ని తీసుకొచ్చి, తర్వాత ద్రాక్ష ఏపిల్స్ పట్టుకొచ్చి చాలా హడావుడి చేశాడు, ఆవేళ చాలాసేపు నా దగ్గరే ఉన్నాడు.

ఆ రోజు అతను నా పట్ల చూపించిన ఆపాయ్యత నాకు అతన్ని సన్నిహితుణ్ణి చేసింది. ఏందుకో అప్పట్నుంచే అతనంటే మనసు మారుమూలల్లో అభిమానం చోటుచేసుకుంది. అప్పట్నుంచి తరచుగా ఇంటికి వస్తుండేవాడు రవి.

ఒకరోజు చీకటిపడ్డాక వచ్చాడు రవి. మోచేతిమీద గాయముంది, నాకాశ్చర్యం కలిగించిన విషయమేమిటంటే.. దారిలో ఉన్న ఆసుపత్రులన్నీ వదిలేసి అతను సరాసరి నా దగ్గరకు రావటం,

# Clinic Special

## క్లినిక్ స్పెషల్ – ఒక స్పెషలిస్ట్
## ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండు కోసం.

మీరు ఎదుర్కొంటున్నది తీవ్రమైన చుండు సమస్య కావచ్చు. ఓ పటాన లొంగని తీవ్రమైన చుండు. ఎక్కువగా వుంది, త్వరగా మేలు కాని చుండు.... ఏం వాడినా ఫలితం మాత్రం శూన్యం.

అలాంటప్పుడు ఒక స్పెషలిస్ట్ సహాయం పొందడం మంచిది. క్లినిక్ స్పెషల్—చుండు కోసం ఒక స్పెషలిస్టు షాంపూ. ఓ పటాన లొంగని తీవ్రమైన చుండును అరికట్టడానికి ప్రత్యేకంగా రూపొందించబడినది.

క్లినిక్ స్పెషల్, ప్రపంచమంతా అత్యంత గుణకారకమని ఋజువు పర్చబడిన ఒక చుండు-నిరోధక పదార్థంతో శక్తివంతం చేయబడినది. క్లినిక్ స్పెషల్ యొక్క లోతుగా చొచ్చుకొని పోయే ప్రత్యేక చర్య ఈ సమస్యను మూలం నుండి తొలగిస్తుంది.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ఠ ఉత్పాదన.

**క్లినిక్ స్పెషల్ చర్య**

క్లినిక్ స్పెషల్ సూక్ష్మీకరణతో ఋజువు పరచబడిన, అత్యంత గుణకారమైన చుండు— నిరోధక పదార్థం ఉంది.

ఇది లోతుగా చొచ్చుకొని పోయే చర్య చుండును నేరుగా తల చర్మంనుంచే తొలగిస్తుంది.

మెరుగైన ఫలితాలకై: ఒకసారి రుద్దుకు కడిగెయ్యా గాని కడగండి. రెండోసారి రుద్దుకు కడిగెయ్యా గాని ఒక నిముషంపాటు వుంచండి.

క్లినిక్ స్పెషల్ క్రమం తప్పకుండా వాడండి. ఇది ఓ పటాన లొంగని చుండు తొలగించడానికి తోడ్పడుతుంది.

మౌనంగా అతని గాయానికిఫస్టుఎయిడ్ చేశాను.

అప్పుడు ఆ క్షణంలో అతని కళ్ళలో కదలాడిన కృతజ్ఞతా పూర్వక మైన మౌనరాగానికి భాష్యం చెప్పటా నికి నా చదువు సందిగ్ధంలో పడింది.

మూడు సంవత్సరాలు గడిచిపో యాయి.

నిన్నటితో ఫైనలియర్ పరీక్షలు కూడా పూర్తయ్యాయి. కాలేజీ వదిలి పెట్టేముందు స్టూడెంట్సందరితో పాటు రవి కూడా నా ఆటోగ్రాఫ్ తీసుకున్నా డు. నెహ్రూ వ్రాసిన డిస్కవరీ ఆఫ్ ఇండియా పుస్తకం కొని రవికి ప్రెజెంట్ చేశాను

ప్రయాణానికి సిద్ధమయి నాకు తెలియకుండానే చాలాసేపు రవికోసం ఎదురు చూశాను నేను మెట్లు దిగు తుంటే వచ్చాడు రవి. నన్ను చూసి మందహాసం చేశాడు. ఆ నవ్వులో జీవంలేదు. అతని కళ్ళలో వెలుగులేదు నా బ్రీఫ్‌కేసును చేతిలోకి తీసుకుని నిర్వికారంగా నడవటం ప్రారంభిం చాడు. నేను అతన్ననుసరించాను

పది నిముషాల్లో బస్టాండ్ చేరు కున్నాం.

o o o

ఆలోచనల్లో ఉండగానే బస్సు శ్రీకాకుళం చేరుకుంది. వడివడిగా ఇంటికి చేరుకుని అమ్మని పలకరించి నా గదిలోకి నడిచాను.

సోఫాలు చేరబడి రవివర్మ ఉత్త రం విప్పుతుంటే ఎందుకో చేతులు వణి కాయి. ఆదురుతున్న హృదయాన్ని స్వాధీనంలోకి తెచ్చుకుని చదవడం మొదలు పెట్టాను.

"మేడమ్!"

దయచేసి ఈ ఉత్తరాన్ని పూర్తిగా చదవండి, మూడు సంవత్సరాల నా ఆలోచన, తపన అక్షర రూపంపొంది ఈ ఉత్తరంగా మారాయి.

మేడమ్ నా జీవితం చీకటిగా బతు కంతా నిరాశగానే వున్నా, ఆ పరిధిలో పదిహేడేళ్ళు గడిపేను.

మేడమ్ ఆ రోజు నాకు బాగా గుర్తు.

అప్పటికి నేను బి.ఏ లో చేరి పదిరోజులవుతుంది. నేను రాత్రులు ఒక రంపపు మిల్లులో పనిచేసి పగలు కాలేజీకి వస్తూండడంతో నాకు బాగా అలసటగా అనిపించేది. అసలు కాలే జీలో చేరి తప్పు పని చేసేనేమోనని పించేది. ఎలాగూ నేను అందరితోను కలసి మెలసి ఉత్సాహంగా చదివిమంచి భవిష్యత్తుకి పునాదులు వేసుకోలేను. ఇలాంటి వికృత వ్యవస్థలో నాలాంటి వాడికి మంచి భవిష్యత్తు ఎదురవు తుందనుకోవడం దురాశ ముందు జీవి తం అందంగా లేనప్పుడు మనిషిగా పుట్టినందుకు యెలాగో ఒకలా బతక డానికి అలవాటు పడిపోవాలి. అందుకే భవిష్యత్తు కోసం పోరాటం ఆపేసి నేను గడుపుతున్న జీవితంలో రాజీ పడి పోవాలని కారుచీకట్లు ముసిరిన నా మనస్సు ఆలోచిస్తుండగా....

నా చీకటి బ్రతుకులోకి ఓ వెన్నెల కిరణం తొంగి చూసింది. ఆ కిరణం పేరు ఉషోదయ!!




మూడవ బహుమతి పొందిన కార్టూను

ఓ శ్వేత వెలుగు కాంతి కిరణానికి పాలరాతి శిల్పాకృతినిచ్చి లేతాకు పచ్చ చీర చుట్టి - కళ్లలో కరుణ, పెదాలపై దరహాసం, చూపుల్లో ఆప్యాయత నింపుకున్న కదిలే కలహంస - పొడవాటి జడ జఘనాలపై అందంగా నడయాడుతుంటే- కదిలే జీవనది- మానవాతీతమైన దేవకన్యక- ఆ దేవకన్య కనుల కరుణామృత ధారల్లో తడిసి పునీతుడైన మనిషి, పుణ్యం గురించి తప్ప పాపం గురించి యోచించలేడు. ఆమె ప్రేమామృత వాహినిలు జడుడు కూడా ఉత్తేజితుడౌతాడు. ఆ దేవిని సందర్శిస్తే లోకంలో ద్వేషాలు, వైషమ్యాలు ఉండవు- అనురాగాలు, అభిమానాలు, ఆప్యాయతలు మానవత్వపు మహోన్నత శిఖరాలపైన నడయాడుతూ, లోకమంతా నిండిపోతాయి.

మేడమ్, ఆ దేవకన్యని నేను చూసాను. క్షణకాలం పాటు ఆమె నా వైపు చూసిన చూపు - ఒక్క స్ప్లిట్ సెకండ్- నా జీవితాన్ని - నా ఆలోచనల్లో చీకట్ని మార్చిన ఆ క్షణం - మీ కళ్లు జాలిగా ఆప్యాయంగా నాపై ప్రసరించిన ఆ క్షణం- నా తల్లి తండ్రుల మూడు నిముషాల ఆవేశానికి ఫలితంగా నా తల్లి చీకటి కడుపులో నవ మాసాలు నిశ్చింతగా నిద్రపోయిన నేను - ఈ పదిహేడేళ్ల జీవితానుభవంలోనూ జన్మ జన్మలకూ సరిపోయేటంత చేదు అనుభవాల్ని మోసి అలసిపోయి, నిరాశగా అమ్మకడుపులో నిద్ర తర్వాత.... వెంటనే అంతిమ నిద్రకు యెందుకు ఉపక్రమించలేదా ? అని నన్ను నిత్యం వేసుకునే ప్రశ్నను మరిపించింది,

మేడమ్! ఆ రోజు నా ఆలోచనల్లో నిజంగా ఉన్న బొమ్మల్ని తలచుకుంటూ చేతికి గాయం చేసుకున్నాను, ఆ గాయం

కట్టుకుంటూ ఆందోళనగా ఆప్యాయంగా నా వైపు చూసిన మీ కళ్లను చూసి. నాకు పదేళ్ల వయసులో నన్ను సంరక్షించవలసిన ఆయా, నేను ఆటలాడుతూ పడిపోయి అగాయాన్ని తనకి చూపిస్తే నన్ను ఛీత్కారం చేసి చెంపదెబ్బకొట్టిన రూపు గుర్తొచ్చి ఆవిడ యెక్కడున్నా వెతికి తెచ్చి స్త్రీత్వం ఉషోదయా కేడమ్‌లా సంతరించుకోవటానికి తపస్సు చెయ్యి అని అరిచి చెప్పాలనిపించింది.

మేడమ్, రాగపూరితమైన దృక్కులతో కలియజూస్తూ డయాస్‌పైన నిలబడి పాఠం చెప్తున్నపుడు అందంగా కదులుతున్న మీ పెదవులు చూస్తుంటే ఒక దేవత నా ముందు ప్రత్యక్షమయి "ఏం కావాలో కోరుకో". అని అడుగుతున్నట్టుండేది.

మేడమ్, నేను "కవి"ని కాను, కానీ ఒక్కసారి కవినై అనురాగానికి ప్రతీకలా నిర్మలంగా కనిపించే మీ సౌందర్యపు ప్రతి అణువును వర్ణిస్తూ కావ్యాలు వ్రాయాలని ఉంది.

"దిగిరాను దిగిరాను దివినుంచి భువికి" అని నీలాకాశంలో నిల్చి మీరు నీలికళ్లతో నవ్వుతుంటే, భువిపైన నిల్చిన నేను చిత్రకారుణ్ణై నా కందనంత ఎత్తులో అపూర్వంగా మెరిసే తారకను యదాతథంగా చిత్రించి ఆ చిత్తరవును భద్రపరచు కోవాలని ఉంది. నాగుండె నెత్తురును మీపాదాలకు పారాణిగా పూసి మీ కళ్లలో నును సిగ్గుతో కలసిన వెలుగు వెన్నెలకు మెరుగులు పెడుతుంటే ఆ అపూర్వ క్షణాన్ని జన్మ జన్మలకూ ఎదలోపల పదిలంగా దాచుకోవాలని ఉంది.

మేడమ్, నేనెమైనా తప్పుగా వ్రాస్తున్నానా? మిమ్మల్ని చూడకపోతే పిచ్చిగా అనిపించిన రోజులు. ఒకసారి సెలవులకు మీరు శ్రీకాకుళం వెళ్ళిపోతే లోకమంతా చీకటిగా, నిస్తేజంగా కనిపించి ఆ నిరాశను తట్టుకోలేక నేను కూడా మరునటిరోజు వచ్చేసి. నరాసరి మీ ఇంటికి వచ్చే ధైర్యం లేక నా దేవతకి కొంచెం దూరంలో చీకట్లో చర్చి మెట్లపైన కూర్చుని. నీరవ నిశ్శబ్ద నిశీథిలో నాపై కురిసిన మంచు బిందువులు నా దేవత కరుణామృత ధారల్లా నా మనస్సుని పులకింపజేస్తే. పునీతుణ్ణయి. ఆ పవిత్ర తొలిసంధ్య వెలుగులో నా దేవతని సందర్శించిన క్షణం.

ఇవేవీ నేను స్కిజొఫ్రెనియాక్ నేమో, నన్ను నా చుట్టూ ఉన్న పరిస్థితుల్ని మర్చిపోయి, ఎక్కడో ఊహాలోకాల్లో విహరిస్తూ నా చుట్టూ ఓ రంగుల కలల ప్రపంచాన్ని నిర్మించుకుంటున్న మానసిక వ్యాధి గ్రస్తుణ్ణేమో నన్న ఆలోచన నాకు ఎప్పుడూ రాలేదు.

మేడమ్, నన్ను అర్థం చేసుకోవ

టానికి— అర్థం కాకపోతే క్షమించటానికి ప్రయత్నిస్తారు కదూ.

మేడమ్, మీకు గుర్తుందా, మీ పుట్టిన రోజునాడు నేను మీ ఇంటికి వచ్చాను — మీరు స్వీటు నా నోటికందించినపుడు— మూడు క్షణాల ఆవేశానికి లొంగిపోయి తర్వాత సంఘానికి భయపడి అనాథ శరణాలయంలో నా చీకటి బ్రతుక్కి నాంది పలికించిన అమ్మ గుర్తొస్తుంది — ఏడుపొస్తుంది. మనసులో మౌనంగా కదలాడిన విషాదపు తెరల్లో మునిగిపోయి నన్ను నేనే ఓదార్చుకున్నాను.

మేడమ్, మీరు నా జీవితంలోకి రాగలిగితే పేదవాణ్ణయిన నేను మీకేమివ్వలేను. నా హృదయాన్ని తెచ్చి గులాబీల శయ్యపైన మిమ్మల్ని శయనింపచేసి అనురాగాభిషేకం చేస్తాను.



"డార్లింగ్ డార్లింగ్" చిత్ర శతదినోత్సవం సందర్భంగా ఆ చిత్ర దర్శకుడు శ్రీ భాగ్యరాజ్‌కు విజయవాడ హోటల్ సుహాస్‌లో సన్మానం జరిగిన సందర్భంగా ఆయనకూ, ఆయన శ్రీమతి ప్రవీణ్‌కు నవయుగ ఫిలింస్ తరపున మెమెంటో సమర్పిస్తున్న శ్రీ [illegible]ఖాన్

## లంఘనం

ప్రపంచం
తలుపులన్నీ మూసినప్పుడు
జీవితప్పిల్లి
పులిగా మారి
పుడమి పునాదులను
కదిలిస్తుంది—
వ్యవస్థ రొమ్ముమీద
రోషంతో పంజా విసురుతుంది—
ముసలి శావన దేశమా
తస్మాత్ జాగ్రత—

**శైలకుమార్**

పీడమ్: మీరు నన్ను ప్రేమించ గలిగితే....

"నాకు మీ అనురాగంతో పాటు "మదర్లీ ఎఫెక్షన్" కూడా కావాలి" మీ అనురాగ వాహినిలో తడిసిపోయి మీ ఒడిలో సేదదీరి చీకట్ని పారద్రోలి నా బ్రతుకులో వెలుగును నింపుకోవా లనుకునే స్వార్థ జీవిని. నన్ను క్షమించ గలరు కదూ. ఇదంతా మీతో స్వయంగా చెప్పుకోలేని అసమర్ధుణ్ణి, దురదృష్ట వంతుణ్ణి.

క్షమించటానికైనా ప్రేమించటాని కైనా మీ స్వచ్ఛమైన అనురాగపూరిత నీలికళ్లు నన్ను మళ్లీ ఒకసారి చూస్తా యని జీవితాంతం ఎదురు చూస్తూ - ఉంటాను.

రవివర్మ.

o o o

తెల్లవారు తుండగా ఉత్తరం చదవ టం పూర్తిచేశాను. హృదయం బరు వెక్కింది.

"నాకు మీ ప్రేమతో పాటు మదర్లీ ఎఫెక్షన్ కూడా కావాలి:" ఈడీపెస్ కాంప్లెక్స్‌తో బాధపడుతున్న రవివర్మ మాటలు చెవుల్లో గింగురు మంటు న్నాయి. అప్రయత్నంగా నా కళ్ళలో నీళ్లు తిరిగాయి. "తల్లితో మానసికంగా సన్నిహితంగా ఉండే కొడుకులు — తల్లిప్రేమకు నోచుకోనివాళ్లు ఈడీపెస్ కాంప్లెక్స్‌తో బాధపడుతుంటారు. ఈ కాంప్లెక్స్‌తో బాధపడే వాళ్ళకి తల్లి పట్ల అనురాగం ఎంత బలంగా ఉంటుందంటే ఒక దశలో వాళ్లు తండ్రిని చంపేసి తల్లిని పెళ్ళి చేసు కోవాలనుకుంటారు" అంటాడు ఫ్రాయిడ్

---

మొదటి కానిబల్: నిన్ననువు తీసుకొచ్చిన పెద్దమనిషి ఎవరో గాని అతను నాకేం నచ్చలేదు.
రెండో కానిబల్: అయితే పోనీ ఇవాళ శాకాహారమే తిను.




తల్లిప్రేమకు నోచుకోని రవివర్మలో ఈ సంఘర్షణ యెంతబలంగా ఉందో జరిగిన సంఘటనలను బట్టి అతనిలో నాసాన్నిహిత్యాన్ని బట్టి నేను ఊహించుకోగలను. నా మనసులో ఏదో యెగోన. రవివర్మపై నాకు జాలి కలిగింది. యెవర్నీ పెళ్ళి చేసుకోకుండా ఉండాలనుకున్న నేను రవివర్మను పెళ్ళిచేసుకుంటే అతనికి అందమైన భవిష్యత్తు ఇచ్చినదాన్నవుతాను. రవివర్మ ఈజ్ ఎ లవ్ సీకింగ్ సైకో. అతనికి ప్రేమ కావాలి. ప్రేమ రాహిత్యంలో జీవితాన్ని గడిపితే అతను జీవితంలో ఏం కోల్పోతాడో ఓ సైకాలజిస్టుగా నేను ఊహించుకోగలను.

రవివర్మకు నా అవసరం ఉంది. అతనిలోని ఘర్షణని అర్థం చేసుకుని అతని మానసిక భౌతిక అవసరాల్ని తీర్చటానికి మరెవరూ ముందుకురారు యెందుకంటే .. ?

అతను చెవిటివాడు! మూగవాడు కూడా! చీకటిని చీల్చి, తూరుపు దిక్కు అరుణ కాంతుల్ని వెదజల్లుతోంది. రవివర్మ చీకటి జీవితంలో వెలుగుల్ని నింపటానికి నేను లేచాను. ❋

---

❋ బార్‌లో భోజనం వడ్డించే ఆ సర్వర్ మీద మండి పడ్డాడు కాంతారావు.

"ఏమిటి ఇలాంటి పాడుగుడ్లు పెట్టావిక్కడ ?"

"గుడ్లు పెట్టేది నేను కాదండీ, నేను ప్లేట్ పెట్టాను, అంతే."

---



# లార్సవిన్ డిపాజిట్ పథకాలలో పెట్టుబడి పెట్టండి

## తక్కువ కాలపరిమితిలో ఎక్కువ ఫలితం పొందండి

ఆకర్షణీయమైన ఈ స్వల్ప కాలిక పెట్టుబడి ద్వారా మంచి అవకాశం. "స్వల్ప కాలిక డిపాజిట్ పథకం" లో పెట్టుబడి పెట్టమని లార్సవిన్ ఫైనాన్స్ మిమ్మల్ని ఆహ్వానిస్తోంది. లార్సవిన్ గ్రూపు పరిశ్రమల సభ్యసంస్థ "లార్సవిన్ ఫైనాన్స్" ఈ గ్రూపు పరిశ్రమల నిర్వహణలో సాలీనా 15 కోట్ల రూపాయల టర్నోవర్ కలిగి ముందడుగు వేస్తోంది.

ముఖ్యమైన మూడు స్వల్ప కాలిక డిపాజిట్ పథకాలను లార్సవిన్ రూపొందించింది.

* లార్సవిన్ ఇండస్ట్రియల్ ఫైనాన్స్ డిపాజిట్ పథకం

మీ అవసరాలను ఆదుకోవడం కోసం రూపకల్పన చేయబడిన లార్సవిన్ ఇండస్ట్రియల్ ఫైనాన్స్ డిపాజిట్ పథకం పరిపూర్ణంగా మీకు సహాయపడుతుంది. డిపాజిట్ కాలపరిమితులు మరియు డిపాజిట్ చేసే సొమ్ము మొత్తముల విషయంలో మీ నిర్ణయాన్ని ఆదరిస్తాం. డిపాజిట్లను లార్సవిన్ ఫైనాన్స్ ఆర్థిక ప్రగతికలిగి పురోగమన పథంలో వున్న పరిశ్రమలను ఎంపికచేసి వాటిలో పెట్టుబడి పెడుతుంది. ఈ డిపాజిట్ కాలపరిమితి 6 నెలలనుండి 3 సంవత్సరాలవరకు సానుకూలమైన వడ్డీ 14% నుండి 18% వరకు ముడుతుంది. మీరుగనుక 3 సంవత్సరాల డిపాజిట్ తీసుకుంటే అదనంగా బోనస్ పొందే వక్కటి

# మనసు - మనిషి - మనసు

## ప్రతాప రవిశంకర్

ఇన్‌లాండ్ కవరు. ఎడ్రసు చూశాను. నాపేరే వున్నది. డోర్ నంబర్ కూడా చూసిన తర్వాత కవర్ని ఓపెన్ చేశాను. ఆ దస్తూరి నాకు అంతగా పరిచయంలేదు. గుండ్రంగా వున్నాయి అక్షరాలు. అందులో-

"డియర్ నరేంద్రా.... ఎలా వున్నావ్? ఏమైంది నీకు? నేను లేజీనెస్ వల్ల లెటర్స్ రాయటం లేదనుకో. నువ్వయినా రాయవచ్చును కదా! నీకో ముఖ్యమైన వార్త.... నాకు మళ్ళీ ఇంటర్‌వ్యూ వచ్చింది. ఎక్కడో కాదు అక్కడే.... ఈ నెల పన్నెండో తారీకున.... పదకొండు రాత్రికే నీ గదిలో ప్రత్యక్షం అవుతాను. సిద్ధంగా వుండు. హోటల్‌నించి భోజనం కారియర్ తెచ్చి గదిలో వుంచు.... పదకొండు రాత్రి.... ఇద్దరం నీ గదిలో.... తెలుసుగా....

అంతవరకు చదివేసరికే నా వళ్లంతా చెమటతో తడిసిపోయినట్లనిపించింది. ఆ ఉత్తరం నన్ను ఉద్దేశించి రాసినది కాదు.

మళ్ళీ ఎడ్రసు చూశాను- నా పేరే నా పేరు ఉన్న మనుషులింకాకొంతమంది ఉండే ఉండొచ్చు, కాని డోరునెంబరు నేను వుంటున్న ఇంటిదే. నేను వుంటున్న కాంపౌండ్‌లో నరేంద్ర పేరుగల మనుషులు ఎవ్వరూ లేరు.

అయితే ఈ ఉత్తరం ఎవరిది? చదవటం మొదలుపెట్టాను క్యూరియాసిటీని ఆపుకోలేక

"నరేంద్రా.... తలచుకుంటే ఆశ్చర్యంగా వుంది. అంతా కలగా వున్నది. అలా జరుగుతుందని నేనెన్నడూ వూహించలేదు. నా ఫ్రెండ్ సునీత ఆ గదిలోనే వుంటున్నదని ఉత్తరమైనా రాయకుండా ఇంటర్‌వ్యూ కోసం అక్కడకు వచ్చాను. కాని ఓ పది రోజుల క్రితమే సునీత అక్కడినుంచి వెళ్ళిపోవటం నువ్వు ఆ గదిలో వుండటం జరిగింది. నిన్ను చూడగానే నా మతి చలించింది. అందుకే నువ్వు అడగ్గానే ఆ రాత్రి నీ గదిలో వుండిపోయాను పూర్తిగా అపరిచితుడివైన నీతో ఆ రాత్రి గడిపాను. ఆ అనుభవాన్ని జీవితంలో మరువలేను. నాకు మళ్ళీ అటువంటి అనుభవం కావాలి. పదకొండు రాత్రికోసం ఎదురుచూస్తూ వుంటాను మరి. బై.... నీ ప్రియమైన అఖిలేశ్వరి.

మరోసారి కూడా చదివాను ఆ

ఉత్తరాన్ని. నా గుండెలో ఓ విధమైన అలజడి మొదలయ్యింది....

ఈ ఉత్తరంలో వున్నదంతా నిజంగా జరిగినదేనా ? లేక నన్ను ఫూల్ని చెయ్యటానికి ఎవరయినా ఇలా రాశారా ?

పోసల్‌ముద్ర చూశాను. విజయవాడలో పోస్టుచెయ్య బడింది ఆ ఉత్తరం తొమ్మిదవ తారీకున.

ఈ రోజు పది.

పదకొండు రేపే.... రేపు రాత్రికే ఆ ఉత్తరం నిజమయితే అఖిలేశ్వరి నా గదికి వస్తుంది.... నా వూహ నిజమయితే ప్రస్తుతం నేను వుంటున్న గదిలో నా పేరుగల మనిషి కొన్ని రోజుల క్రితం వరకు వుండివుండాలి. ఆ గదిలోకి నేను అద్దెకు వచ్చి నెల రోజులే అయ్యింది....

అప్పటి కప్పుడే పక్క యింట్లో వుంటున్న ఓ కుర్రాడిని పిల్చి ఇంత క్రితం నాగదిలో వున్న మనిషి గురించి అడిగాను. అతని గురించి తనకేమీ తెలియదని చెప్పాడు ఇంటి యజమాని అక్కడ వుండడు. సోమాజిగూడలో వుంటాడు.

ఆమరురోజు ఉదయం పోస్టుమేన్‌ని అడిగి తెలుసుకుందామనుకున్నాను. కానీ ఆదివారం-పోస్టుమేన్ రాడు....

ఆ రోజు సాయంత్రం నేను ఆఫీసు నించి గదికి వచ్చేసరికి ఆ ఉత్తరం తలుపు సందులోనించి లోపలకు విసిరెయ్య బడివున్నది.

దీపాలు వెలిగాయి.

స్విచ్ నొక్కాను. లైటువెలిగింది వెలుతురు గదినంతటినీ పరచుకున్నది.

ఆ వెలుగులో గదిని పరిశీలించాను.

ఆ ఉత్తరమే నిజమయినట్లయితే - ఆ రాత్రి అఖిలేశ్వరి-నరేంద్ర ఎక్కడ పడుకుని వుంటారు ?

చూస్తున్నాను....

సిగరెట్టు కాలుస్తుంటే ఆ ఉత్తరంలో వాక్యాలు కళ్ళముందు కదిలాయి- ఓ అపరిచిత వ్యక్తితో ఓ రాత్రి గడిపిన అఖిలేశ్వరి రేపు ఆ నరేంద్రను నేను కాదని తెలిసివచ్చాక నాతో గడపకుండా వెళ్ళిపోతుందా? ఉండిపోతుందా? ఏమో ?

అఖిలేశ్వరి అందాన్ని అంచనా వేసుకుంటున్నాను. ఓమాదిరి అందంగా వున్నా పర్వాలేదు.

ఆ రాత్రి అఖిలేశ్వరి గురించిన ఆలోచనలతో సరిగా నిద్రపోలేదు. తెల్లవారిన తర్వాత అద్దంలో చూసుకుంటే మొహం పీక్కుపోయివున్నది.

చాలా అసహనంగా రాత్రి వరకూ గడిపాను. హోటల్ నించి భోజనం కేరియర్ తీసుకు వచ్చాను.




ఆ రాత్రి అఖిలేశ్వరితో నేను పొందబోయే సుఖం గురించి ఆలోచిస్తున్నాను. ఆమె తప్పకుండా నా గదిలో ఆ రాత్రి గడుపుతుందనే నమ్మకం నాలో బలపడిపోయింది.

అఖిలేశ్వరికి మళ్లీ ఆ అనుభవం కావాలిట.

పదిగంటలు కావస్తుండగా నా గది బయట ఆటో రిక్షా ఆగింది. అందులో నించి దిగి మెరుపు తీగెలాంటి ఓ ఇరవైయేళ్ల అమ్మాయి ఓ సూట్కేసుతో లోపలకు వచ్చింది.

ఆమె అందం నన్ను ఎంతగానో ఆకర్షించింది....

నన్ను చూసి "నరేంద్ర గారు లేరా" ? అనడిగింది ఆశ్చర్యంతో....

"నా పేరు నరేంద్ర" అన్నాను చిరునవ్వుతో.

ఆమె మరోసారి ఆశ్చర్యపోయి "మీరు నాకు తెలీదు. ఈ గదిలోకి మీరు వచ్చి ఎన్నాళ్లయింది?" అని అడిగింది.

"నెలరోజులు"

అఖిలేశ్వరి సన్నగా ఏదో గొణుక్కున్నది. ఆమె మొహంలో చోటు చేసుకున్న నిరుత్సాహాన్ని గమనించాను.

"అయితే నేను రాసిన ఉత్తరం."

"నేను అందుకున్నాను క్షమించండి. ఆ ఉత్తరాన్ని నేను చదివాను. కవరుమీద నాపేరు, ఎడ్రసు సరిగా వుండటంవల్ల ఆ ఉత్తరాన్ని ఓపెన్ చేశాను" చెప్పాను.

అలా చెప్పగానే ఆమె ముఖంలో

మారిన భావాలని నేను సరిగా అర్థం చేసుకోలేకపోయాను.

"నిలబడే వున్నారు....రండి మీరు డిసప్పాయింట్ కావలసిన పనిలేదు. ఈ రాత్రిమీరు ఈ గదిలో గడపవచ్చు మీరు ఉత్తరంలో రాసినట్టుగానే భోజనం కేరియర్ తెసుకు వచ్చాను."

అఖిలేశ్వరి నా కళ్లలోకి సూటిగా చూసింది తన గురించి నాకు తెలిసి పోయినందుకు గిల్టీగా ఫీలవుతోందని గ్రహించాను.

"థాంక్స్ .... వెళ్లొస్తాను" అని సూట్కేసును తీసుకున్నది.

అప్పుడు నేను కంగారుగా "వెళ్ళటం ఏమిటి? నన్నుఆ నరేంద్రగానేఅను కోండి ఎంతో ఆశతో వచ్చి అప్పుడే వెళ్ళిపోతారా? మీరు వెళ్ళటానికి వీల్లేదు ఈ రాత్రికి నా ఆతిధ్యాన్ని స్వీకరిం చాల్సిందే" అన్నాను చొరవగా ఆమె చేతిలోని సూట్కేసును అందకో బోతూ.

ఆమె ఒక అడుగు వెనక్కి వేసి అదోలా నవ్వి" మీ ఆలోచనలను చదవ గలను. నా ఉత్తరం చదివి ఆశపడు తున్నట్టున్నారు. ఒక అపరిచిత వ్యక్తితో రాత్రి గడిపిన అమ్మాయి నాతో కూడా ఈ రాత్రి గడపవా అను కుంటున్నారేమో? ఆ నరేంద్ర నా మనసును దోచుకున్నాడు. నాకు ఆ నరేంద్రతోనే అలాంటి అనుభవం కావాలి. కేవలం అనుభవమే కావా లనుకుంటే ఇక్కడి వరకు రావలసిన అవసరంలేదు. మీలాంటి మగాళ్లు విజయవాడలో వేలమీద వున్నారు. నా గురించి శ్రమ తీసుకుని కారియర్ తీసుకు వచ్చినందుకు థాంక్స్ వెళ తాను" అని సూట్కేసుతో గబగబా బయటకు వెళ్ళిపోయింది అఖిలేశ్వరి.

ఆమె వెళ్ళిపోయిన తర్వాత నాకు కడుపులో ఆకలి గుర్తుకు వచ్చింది.

నీతి తప్పటంలో కూడా ఓ క్రమం వున్నదా?

ఆలోచిస్తూ గదిలో టేబిల్ మీద మీద వున్న భోజనం కేరియర్ గ్గ రకు నడిచాను.

---

○ "ఏరా శీనూ లక్ష్మణ్‌గాడి బర్త్ డే పార్టీకి వెళ్ళావా?
"లేదురా."
"అరె! ఎందుకని?"
"ఇన్విటేషన్‌లో ఆరునుంచి ఎనిమిది అని వుంది. మరి నా వయసు తొమ్మిదికదా,"

---





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుండి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారి భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

కంపెనీ పేరు అచ్చువేసి ఉన్న కవరు చూసి పోస్ట్‌మాన్‌ను థేంక్ చేసింది పద్మావతి. ఆశగా, ఆతృతగా కవరు చింపింది లోపల పెద్దఉత్తరం "మైడియర్ పద్మావతీ-నేను నిన్ను పిలవదలుచుకున్న పిలుపు ఇది కాదు తేటతెల్లమైన తెలుగూకాదు ఎబ్బెట్టుగా అనిపిస్తోంది. మేనకోడలు పద్మావతికీ ఇదీ బాగున్నట్టు లేదు-చిరంజీవి సౌభాగ్యవతి పద్మకి-బెటర్-బట్ ఏమిటో ఛాందసంగా ఉంది.

మొదటిసారి నీపేర ఉత్తరం రాస్తున్నాను. తెలుగులో రాయాలని పట్టుదల. అక్షరాలు తప్పలుంటే మన్నించు. తెలుగు రాయడం మాట అటుంచి చదవడమూ అలవాటు తప్పిపోయి ఈ మధ్యనే దృఢనిశ్చయంతో రివైవ్ చేసుకుంటున్నాను పరభాష విసుగొచ్చింది. కాని స్వభాష మరచిపోయిన స్థితి. కొన్ని జీవితాలంతే! దాని మాట కెంగాని ఇక ఈ ఉత్తరం సంగతి. ఎంతో ముఖ్యం అయితేగాని రాయనని నువ్వు తెలుసుకునే ఉంటావు.

అమ్మ, ఆదే మీ అమ్మమ్మ ఓ పక్కనుంచి ఆతృతగా చూస్తూ ఇలా అంటూ ఉండీ ఉంటుంది "ఎంపికే అంత ఆదుర్దా! మరి సి-చెజేకలా నీకివ్వ గలిగిన ఉద్యోగం మామయ్య మరొకరి కెందుకిస్తాడు? ఆగెలాగూ వస్తుంది నువ్వు ఢిల్లీ వెళ్ళనూ వెళతావు. అలా కాలుగట్టిన పిల్లిలా తిరగకపోతే కాస్త పనిసా[illegible]కూడదూ".

ఏకో [illegible] లం మనిషి ఉన్న ఒక్క [illegible] ఎందుకు కొంగా కుండా పోయాడన్న దిగులు అమ్మ ఏదో అంటూ ఉంటుంది-చదువుకున్న దానివి పట్టించుకోకు.

అబ్బ-తెలుగులో రాత చాలా కష్టం సుమా! ఆలోచనసవరిగెత్తుతున్న వేగానికి కొంతయినా దగ్గరగా వస్తుంది ఇంగ్లీషు షార్ట్‌హాండ్ ఎలాం ఉండినే ఉంది. ఇంగ్లీషులో స్టైనోకి డిక్టేట్ చెయ్యడం ఇష్టంలేక-తెలుగు రాయాలని ముచ్చటపడి రాస్తున్నా! ఏంచెబుతున్నానూ-తెలుగుభాష-కాదు లిపి-అక్షరాల వంకరలతో తిరిగి తిరిగి వస్తున్న ఊహ కాస్తా ఇంకిపోతుంది. తెలుగులో డిక్టేషన్ తీసుకోగలిగిన మనిషి దొరికితే ఎంత బావుణ్ణు

కాని ఇప్పుడు అనుకొని ఏంలాభం.

ది పాస్ట్ ఈజ్ డెడ్ ఎండ్ ది ఫ్యూచర్ ఈజ్ బ్లీక్-అయినా ఆడవాళ్ళ ఇటు ఉద్యోగం అటు భర్తా, లేకపోతే అటు ఉద్యోగం ఇటు భర్తా కత్తిమీద సాము. అవివాహితగా ఉండిపోవడం ఏ మాత్రం వాంఛనీయం కాదు ఎంతో అనుభవంతో చెబుతున్నాను. కేవలం అమ్మమ్మమాటగా తీసెయ్యకు. ఎంతో ఆలోచించి నే తీసుకున్న నిర్ణయం తీసుకున్నాను. కోప్పడకు.

ఇప్పుడు బ్రాంచీ ఆఫీసులో పనిచేస్తోంది అపరాజిత నా దగ్గర పనిచేసింది. నేనంటే ఎంతోగురి. ఎంతో అభిమానం... ఎంతో... అల్లాంటివి బయటకు అనవలసినవి కావు కాగితం మీద పెట్టేసాహసం నాకు సూ[illegible]

రెండేళ్లు పంచేళత నేను ఉండబట్టలేక పోయాను అయామ్ సారీ మధూ

నా పిల్లల తండ్రి స్థానాన్ని నీ కివ్వలేను. బాధపడకు. ఇది బ్రతుకు-బద్ధ అవుతే మరి అతుక్కోదు. నీకు కష్టం కలిగించడం నాకు ఇష్టంలేదు. కుటుంబం ఒక బరువు, ఒక బాధ్యత- మనలాంటి మనుషులకు ఒక క్రమశిక్షణ. నన్ను మరచిపొమ్మని నిన్ను అడగడం కంటె నేనే దూరంగా తప్పుకోవడం శ్రేయోదాయకమనిపిస్తోంది"

ఆవిడ నాతో మాటాడిన నిజాలు, మరచిపోలేని మాటలు, రెండు బాధ్యతలను నిర్వర్తించడంలో వచ్చే ఒడుదుడుకులను నేను కళ్ళారా చూశాను

అప్పటికి అనుభవం సంపాదించాలన్న అహంకారం నన్ను స్వేచ్ఛాప్రియుణ్ని చేసింది. నేను బందిఖానా అనుకున్నది నిజమైన స్వేచ్ఛ అనీ, ఆనందమనీ, తృప్తినిచ్చేదని ఇప్పుడు నేను తెలుసుకున్నా ఉపయోగం లేనిది. నువు ఉపయోగపడతావని ఈ ప్రయత్నం.

మనిషి అహంకారం మహా చెడ్డది ఓడిపోతూ గెలుస్తున్నాననుకుంటాడు. అపరాజిత వెళ్ళిపోయింది. మరో అరుంధతి వచ్చింది. ముగింపు మామూలే. నాకు ఏలోటూ లేదు, తృప్తి తప్ప.

నాలో వైరాగ్యము పెరిగింది.

అమ్మ గోలచేసి పిడికిత చెప్పి లాభం లేదనుకొని నా దగ్గరనుంచి వెళ్ళిపోయి మీ ఇంట్లోనే ఉంటోంది. అన్నీ తెలిసిన మూర్ఖుడినట నేను. ఎంత బాగా చెప్పింది,

ఇది బహుశా నీకు ఇంతవరకూ పూర్తిగా అవగతం కాని విషయమై ఉండవచ్చు జీవితంలో మనం పోగొట్టుకున్నదాన్ని అహంకారంతోనైతేనేం అజ్ఞానంలోనైతేనేం నీకు కావలసిన వాళ్ళు పోగొట్టుకున్నారంటే ఎదురుగా నుంచుని వారించకుండా ఉండగలవా?

నేనూ ఉండలేకపోయాను. అదే ఈ ఉత్తరం వెనుక ముఖ్య కారణం. జీవితంలో ఏది ముఖ్యం?

ఇంటికి వచ్చేసరికి ఎదురయ్యే పిల్లలూ, అలసిన ముఖంతో మొహం నిండా బొట్టుతో శ్రీమతీ-ఇదీ ఈ రోజు నేను పొందలేక పోయిన సుఖం-నన్ను వేధిస్తున్న అసంతృప్తి. అరుంధతి దైతేనే అపరాజిత దైతేనేం నాకు కావలసినది ఆఫీసు పాత్రకాదు. గృహిణీరూపం. ఆమె నాకు ఇవ్వగలిగింది మొదటిదిరెండవది. సరియైన వయసులో అక్కరలేదనుకున్న దురదృష్టవంతుణ్ని నేను.

నాలో పూర్వం హుషారు లేదని వేదాంతినైపోయానని టీటీసి ఇంగ్లీషులో కిలకిలలాడింది కమిటీ మీటింగుకు వచ్చిన అపరజిత.

"నీ పిల్లల్ని తీసుకురాలేదా?" అని అడిగాను. వేదాంతిలాగా నవ్వి' గంజి పెట్టిన నేత చీరల గర గరలు కోసం మోజు పడిన రోజులు పోయాయి, అపరాజిత ఓవిధంగా డిస్ ఎ పాయింట్ అయిందని గ్రహించాను. నో రిగ్రెట్స్. కానీ ఒకటి నిజం. రెండు పరస్పర విరుద్ధ ఆనందాలు కావాలనుకుంటే రెండూ రావడం అసంభవం.

అందులో ఏది ముఖ్యమో ఏది సత్యమో తెలుసుకోడానికి వివేకం అవసరం. మరో విషయం- వచ్చినదానితో తృప్తి పడలేక పోవడం మనిషి నైజం. వదలను వదివేవ సు- సినిమాలు సిగ్గు పడకుండా చూసే వయసు- ఇప్పుడు సినిమాలు చూస్తే నిజంగా నాకు సిగ్గువేస్తోంది- చదువుకున్న మనసు- జాగ్రత్తగా నీ మనసులో ఆవేశం లేకుండా. నా అంతర్యాన్ని అర్థం చేసుకో- చేసుకో గలవనీ, చేసుకుంటావనీ నమ్ముతున్నాను. నీకంటే పెద్దవాడిని- పెద్దల దృష్టిలో, లెట్ లీస్ట్, అమ్మ దృష్టిలో చెడిపోయిన వాడిని- అయినా చెప్పే హక్కు నాకుందని నా విశ్వాసం. వినే వివేకం నీలో ఉంటుందనే ఆశ.

దస్తూరీ బోధపడక ఉత్తరం పక్కన విసిరేస్తావేమోనన్న భయంతో చాలా జాగ్రత్తగా రాస్తున్నాను. సొంతం జాగ్రత్తగా చదువ్.

ఇక స్వగతం.

నేను ఎమ్ కామ్ పాసయిన వ్వాత, ఆ ఊళ్లోనే ఉద్యోగం వచ్చింది. అమ్మ- అప్పటికి నాన్నగారూ ఉన్నారు- నాన్నగారూ చెబుతూనే ఉన్నారు అంత దూరం ఏం వెళతావ్‌లే అని- దూరంగా వెళ్లి విలాసంగా బతకాలనుకున్నాను.

—సుఖానికి లోటులేదు. మరి తృప్తి?- ఇహ దాని కోసం పాకులాడి లాభం లేదు.

అసలు నేను చెప్పాలనుకున్న విషయం నీకు అవగతమైందో లేదో- ఇతరుల అనుభవాలనుంచి మనం మెలుగు తీసుకోవాలన్నది కేవలం ప్లాటిట్యూడ్ కాదు -నేను పొల్పపడిన అహంకారానికి పాల్పడకుండా, నేను చేసిన తప్పుడు గుర్తు వేయకుండా, సంతృప్తికరమైన జీవితాన్ని కోరుకో.

నీతో పాటు ఇంటర్వ్యూకి మన ప్రాంతం అబ్బాయి ఒకతను వచ్చాడు. ఎప్పుడూ స్వంతం కోసం ఏదీ అడగని వాడిని, ఆ అబ్బాయికి ఉద్యోగం ఇమ్మని మేనేజింగ్ డైరెక్టరును అడిగాను- ఆ అబ్బాయి వచ్చి చేరాడు నిన్ననే ఇక్కడ ఉన్న వాళ్ళ అక్కగారింటికి వెళ్లి మాట్లాడాను. నీ ఫోటో చూసి(ఇంటర్వ్యూకి వచ్చినపుడే నిన్ను చూశాడట) పెళ్ళికి ఒప్పుకున్నాడు. అబ్బాయి ఫోటో మీ నాన్నకు రెండు మూడు రోజుల్లో పంపిస్తాను.

ఉద్యోగం చెయ్యాలన్న కోరిక లేకపోయినా, పెళ్లి వానం- అంతకంటె విలువైనదీ ముఖ్యమైనదీ నీకు కలుగచెయ్యాలనే ఇలా చేశాను. నా ఎంపికను నువు ఆమోదిస్తావని ఆశిస్తూ

ఆశీస్సులతో

మావయ్య మధు



# వరుడు కావలెను లేక
# కట్నంతోపాటు కిరసనాయిలు ఉచితం...
## అను యర్రంశెట్టి శాయి 'హ్యూమరాలజీ'-9



పెళ్లిపందిర తా చాలా హడావుడిగా వుంది.

ఆడా, మగా, పిల్లా, పీచూ-ఓపక్క బాండ్‌మేళం. మరోపక్క పెళ్లి పెద్దల కేకలతో హోరెక్కిపోతుంది.

వేమా, సాయిరామ్, రంగారెడ్డి, జనార్ధన్, చంద్ర మొదలయిన కాలనీ వాళ్ళందరం కలసి, కుర్చీల్లో గుంపుగా కూర్చుని బాతాఖానీ కొడుతున్నాం. సాయిరామ్ ఆ తరువాత జరుగబోయే కాలనీ మీటింగ్ తాలూకూ ఎజెండా గురించి ఎడాపెడా చర్చిస్తున్నాడు.

అది మా కాలనీ ప్రెసిడెంట్ గోపాలరావ్‌గారి అమ్మాయి పెళ్ళి అవడంవల్ల కాలనీ వాళ్ళందరూ గుమికూడారక్కడ.

ముహూర్తం దగ్గర పడిపోయింది. పెళ్ళికొడుకు తాళిపట్టుకుని రెడీ అయిపోయాడు. బాజాలవాళ్ళు వేగం విపరీతంగా పెంచేశారు- ఏదో కొంప మునగబోతుందన్నట్లు.

"మన తెలుగు సినిమాల్లో అయితే సరిగ్గా ఇలాంటి సీన్లోనే "ఆగండి !" అంటూ కేక వినబడుతుంది! కదూ"




అన్నాడు రంగారెడ్డి

"అవును! ఇలాంటి "ఆగండి!" సీన్లమీదే కొన్నివందలసినిమాలున్నాయ్" అన్నాడు శాయిరామ్ "అయినాగాని మన ప్రేక్షకులకు ఇంకా ఆ సీనంటేనే ఇష్టం."

సరిగ్గా అప్పుడే "ఆగండి!" అన్న కేక వినిపించి అందరం ఉలిక్కిపడ్డాం మాతోపాటు పెళ్ళి పందిరంతా కూడా నిశ్శబ్దం అయిపోయింది

"ఎవరో భలే జోక్ వేశాడు" అన్నాడు శాయిరామ్ పగలబడి నవ్వుతూ. మేమంతా కూడా నవ్వబోయాం గాని ఆ గొంతు మళ్ళీ కర్కశంగా

"జోక్ కాదు - గాడిదగుడ్డూ కాదు" అని వినిపించింది. ఈసారి ఆ గొంతు తాలూకూ ఓనర్‌ని అందరం జాగ్రత్తగా చూశాం. ఆ గొంతు మరెవరో కాదు. పెళ్ళి కొడుకు తండ్రి, శాయిరామ్‌నే కోపంగా చూస్తున్నాడతను.

"జోక్ కాదండీ!" కొంచెం తగ్గి అడిగాడు శాయిరామ్.

"గాడిదగుడ్డు జోకు! జోకేమిటయ్యా! ఇదిజోకు వేసుకునే టైమా?"

ఇంకా మండిపడుతూ శాయిరామ్ మీదకొచ్చాడతను. శాయిరామ్ మరో నాలుగడుగులు వెనక్కి వేశాడు "నేను జోకనుకున్నాను లెండి-"

"బుద్ధుండాలి - అలా అనుకోడానికి!"

ఇక లాభంలేదని నేనూ, రెడ్డీ జోక్యం చేసుకున్నాం

"వాడికి కొంచెం బుద్ధి ఈమధ్య- టి.వీలో డ్రామా లేయడం మొదలెట్టి నప్పటినుంచే లెండి! అంతకు ముందు బాగానే ఉండేది-" అని సర్దిచెప్పాడు రెడ్డి.

ఇంతలో గోపాల్రావ్ పరుగుతో వచ్చాడుమా దగ్గరికి.

"ఏమిటి వియ్యంకుడుగారూ! ఏం జరిగింది?" అన్నాడు గాభరాగా.

"గాడిదగుడ్డు జరిగింది" అన్నాడు బట్టతలాయన బట్టతల సవరించుకుంటూ.

"గాడిదగుడ్డా?"

"అవును!"

"గాడిద గుడ్డు జరగడమేమిటి?" మరింత గాభరాగా అడిగాడు.

"కాపోతే ఏమిటయ్యా! తాళికట్టే టైము దగ్గర పడింది! ఇంతవరకూ వస్తుకున్న కట్నకానుకలన్నీ ఇవ్వరేం"

"అదేమిటి. కట్నం ముందే ఇచ్చాంగా?"

"కట్నం సంగతి సరేనయ్యా, కిర్సనాయిలు సంగతేమిటి?"

"కిర్సనాయిలా?"

"అవును, తెలీనట్లు పోజస్తావేమిటి? పెళ్ళికూతురిని ఎనిమిదో నెలలోపుల మేము కిర్సనాయిలు పోసి తగిలెట్టా లన్న సంగతే గుర్తులేదా మీకు?"

"ఏమిటి మా అమ్మాయిని ఎనిమిదో నెలలో ఏల తగలెకతారా?"

"అవును, ఏం?"

"వీల్లేదు, మా వంశ ఆచారం ప్రకారం పదకొండోనెల వచ్చేదాకా తగ లెట్టడానికి వీల్లేదు-"

"మీ బోడి వంశ ఆచారం - మీ కోడలికి పాటించండి. మా కోడలిని ఎప్పుడు కిర్సనాయిలుతో తగలెయ్యాలో అది మా ఇష్టం."

"కాదు, మా ఇష్టం" అన్నాడు గోపాల్రావ్.

"అలా ఒకరికొకరు రెచ్చిపోతే ఎలా గోపాల్రావ్ గారు, ఇలాంటి విషయాల్లో పట్టువిడుపులంటూ లేకపోతే కష్టం. మన అమ్మాయిని వాళ్ళచేతుల్లో పెట్టాక వాళ్ళు ఎప్పుడయినా తగలేసు కొవచ్చు. మనం అడ్డు చెప్పకూడం బావుండదు -" అన్నాడు రంగారెడ్డి ఇద్దరినీ శాంత పరుస్తూ.

"సరే, అలాగే ఎనిమిదోనెలే తగ లేసుకోవచ్చు" తగ్గి, అన్నాడు గోపా ల్రావ్.

"మరి కిర్సనాయిలు మాటేమిటి?" మళ్ళీ అడిగాడు బట్టతలాయన.

"ఏం కిర్సనాయిలు?"

"మీ అమ్మాయిని తగలెయ్యడానికి పాతికలీటర్ల కిర్సనాయిలు ఇస్తామని వప్పుకున్నారుగా, అదేది అనడుగు తున్నాను-"

"కిర్సనాయిలు సప్లయ్ చేస్తానని నేను వప్పుకోలేదే"

"వప్పుకున్నారని మధ్యవర్తిచెప్తేనే గదయ్యా- ఈ సంబంధం చేసుకో డానికి వప్పుకుంది."

"ఏడీ, మధ్యవర్తిని పిలవండి"

"పిలవండి."

అందరం మధ్యవర్తి కోసం వెదికాం గానీ మామూలుగానే ఆయనె క్కడా కనిపించలేదు.

"అయ్యా ముహూర్తం మించి







పోతోంది. తాళి కట్టించేస్తే బావుంటుంది...." అన్నాడు పురోహితుడు

"బోడి ముహూర్తం పోతేపోనీ, కిర్సనాయిలు సంగతి తేలకదే తాళికట్టడానికి వీల్లేదురా అబ్బాయ్. పీటలమీద నుంచి లేచి ఇక్కడి కొచ్చెయ్ - అన్నాడాయన. రెడ్డి మళ్ళీ ఆయనను శాంతపరచడానికి ప్రయత్నించాడు

"ఇదిగో చూడండి బట్టతలగారూ" ఆయన కోపంతో ఎగిరిపడ్డాడు

"ఏమిటీ? నా పేరు బట్టతలా?"

రెడ్డి అంగారుపడి నావేపు చూశాడు "ఈయన పేరేమిటని ఇందాక నిన్ను అడిగితే 'బట్టతల' అని చెప్పావు కదా?" అన్నాడు గాభరాగా.

నేను ఎందుకయినా మంచిదని అక్కడ చేరిన గుంపు వెనక్కి నడిచి

"ఊరికే అన్నాలే - సరదాకి." అన్నాను పరుగెత్తుకుంటూ పారిపోడానికి రెడీగానిలబడి.

"సారీ సార్, ఏదో పొరబాటు జరిగింది. ఇంతకూ మీ పేరేమిటన్నారు?"

"గడిదగుడ్డు" ఇంకా మండిపడుతూ అన్నాడు.

"చూడండి గాడిదగుడ్డు.... సారీ" మీరు కోపంగా ఉన్నట్లున్నారు! అలాంటి పేరెక్కడయినా ఉంటుందా ఏమిటి? సరేకానీండి. పేరొదిలేద్దాం చూడండి ఎవరికోడలిని వాళ్ళే కిరసనాయిలు కొనుక్కుని తగలెయ్యడం మన సంఘ ఆచారం. మీరిప్పుడు కొత్తగా పుట్టింటి వాళ్ళే కిర్సనాయిలు కూడా సప్లయ్ చేయాలంటే ఎవరికయినా ఇబ్బందే కదా."

"గాడిదగడ్డు! అలా సప్లయ్ చేసే వాళ్ళ అమ్మాయినే చేసుకుంటామని మధ్యవర్తికి క్లియర్ గా చెప్పాను."

"అయినా అలా కిర్సనాయిలు అడగడమే చాలా తప్పండి." అన్నాడు

మాకాలనీ తాలూకు ఆంజనేయశాస్త్రి జనంలోనుంచి ముందుకొచ్చి

"ఏమిటీ? తప్పా?" బట్టతలాయన మళ్ళీ రెచ్చిపోతూ అడిగాడు

"అవును!"

"ఏమిటి తప్పు?"

"తప్పుకాపోతే ఏమిటయ్యా! ఇవాళ మీరు కిర్సనాయిలు ఉచితంగా ఇమ్మంటున్నారు. రేపు ఇంకా శాయన అంటించడానికి అగ్గిపెట్టె కూడా కావాలంటారు. అసలే పెళ్ళి ఖర్చులూ, కట్నాలూ ఇవ్వలేక చస్తుంటే-పాతిక లీటర్ల కిర్సనాయిలు బ్లాకులో కొని ఇవ్వాలంటే మాటలా ఏమిటి?"

"అదంతా నాకనవసరమయ్యా! మా అబ్బాయికి కనీసం మూడు పెళ్ళిళ్ళయినా చెయ్యాలికదా! ముగ్గురి దగ్గర కట్నం, లాంఛనాలు వసూలు చేస్తే గాని వాడికి నాలుగు డబ్బులు మిగలవని మీకూ వప్పుకుంటారు! అవునా? మరి మిగిలే ఆ నాలుగు డబ్బుల్లో ముగ్గురు భార్యలను ఒకరి తర్వాత ఒకరిని విడివిడిగా కిర్సనాయిలు పోసి తగలబెట్టాలంటే ఎంత ఖర్చో మీరే ఆలోచించండి!" కొంచెం శాంతంగా అన్నాడు బట్టతలాయన.

"పోనీలేవయ్యా గోపాల్రావ్. కిర్సనాయిలు ఇచ్చేసెయ్, అయిన ఖర్చు ఎలాగూ అయింది. ఇంక ఇప్పుడు పెనక్కు తగ్గడందేనికి," ఎవరో గోపాల్రావ్‌కి సలహా ఇచ్చారు.

"ఇమ్మంటారా," సందేహంగా అడిగాడు గోపాల్రావ్.

"ఇచ్చేసెయ్. ఈ సంబంధం తప్పిందంటే మళ్ళీ ఎప్పటికి ఇంకో సంబంధం కుదురుతుందో ఏమో ఈ లోగా మీ అమ్మాయికి భర్తచేతిలో తగలబడే వయసు దాటిపోవచ్చులేదూ? ఏ వయసు ముచ్చట ఆ వయసులో జరిగితేనే 'ముద్దు' అన్నారు. అంటే నా ఉద్దేశ్యం మీ అమ్మాయి కలకాలం ఇలాగే కిర్సనాయిలు చావు తప్పించుకుని భ్రష్టత్వం పొందుతుందనికాదు. ఏదొక సంబంధం చూసి ఎలాగూ పెళ్ళి చేస్తావ్. ఆ అత్తమామలు, భర్తాకలసి ఎలాగూ కిర్సనాయిలు పోసితగలెయ్యకామానరు. యెటోచ్చీ నీకు టైము ప్రకారం అమ్మాయిని చంపించలేకపోయానే అన్న దిగులుండి పోతుంది ఆఖరివరకూనూ" నెమ్మదిగా నచ్చచెప్పాడు జనార్ధనం.

"సరే" అన్నాడతను

అంతలోనే గోపాల్రావ్‌గారి భార్య సావిత్రమ్మ కన్నుల లేచింది,

"ఏమిటి, కిర్సనాయిలు ఇస్తారా? అమ్మాయి వయసుదాటి పోతోంది కదా! ఇలాంటి కొత్తపద్ధతులన్నీ మొదలెడితే ఇంక అయినట్లే. ఇవాళ కిర్సనాయిలు వప్పుకుంటే రేపు అగ్గిపెట్టె కూడా ఇమ్మంటారు. ఆ తర్వాత మీ అమ్మాయి అంత్యక్రియల ఖర్చు కూడా పెట్టుకొమంటారు. ఇలా దీనికి అంతం యెక్కడుంది. పిల్లేదు కిర్సనాయిలు ఇవ్వడానికి ఛస్తే వప్పుకోను." అందామె మొండిగా.

మరుక్షణం మాకాలనీ తాలూకూ ఆడాళ్ళందరూ అలవాటు చొప్పు చప్పట్లు కొట్టారు ఉత్సాహంగా.




"అవును! ఇలా అర్థమయిన సౌకర్యాలు పెంచడానికి వీల్లేదు." అంటూ అరిచారు కొంతమంది.

ఇక లాభం లేదని రెడ్డిగారు మళ్ళీ కల్పించుకున్నారు.

"చూడండమ్మా! పద్ధతులనేవి కాలాన్ని బట్టి మారుతుంటాయ్! మనం అడ్డుపడకూడదు! ఆ రోజుల్లో పద్ధతులే వేరు! మా తాతయ్య ఇప్పటికీ చెప్తుంటాడు. వాళ్ళకాలంలో మొగాళ్లు ఒకటే పెళ్లి చేసుకుని, ఒకే భార్యతో జీవితాంతం కాపురం చేసేవారట. అలాగే ఒక వంశానికీ ఒక్కోరకమయిన ఆచారాలు ఉంటాయ్. మా వంశం ఆచారం ఏమిటంటే మగాళ్లు వరుసగా ముగ్గురు భార్యల వరకూ కాల్చి చంపాలి. నాలుగో భార్యమాత్రం జీవితాంతం సంసారం చేయాలి. ఏపరిస్థితుల్లోనూ ఆమెను కిర్సనాయిలుపోసి కాల్చి చంపకూడదు. ఒకవేళ తనంతట తానుగా ఆమె ఆత్మహత్య చేసుకోవడం - లేదా చనిపోవడం జరిగితే అప్పుడు గాని ఇంకో పెళ్ళి చేసుకోడానికి వీల్లేదు.

అలాగే ఆంజనేయ శాస్త్రిగారి వంశ సంప్రదాయం ప్రకారం పెళ్ళయిన సంవత్సరం లోగా వరుసగా నలుగురు కోడళ్ళను అత్తా మామలు మాత్రమే కిర్సనాయిలుపోసి నిప్పంటించా - వాళ్ల కొడుకు కేవలంవారికిసహాయంచేయాలి గాని స్వయంగా నిప్పంటించ కూడదు.

ఇక జనార్ధన్ గారి సంప్రదాయం మరోరకంగా ఉంటుంది. ఇంటికోడల్ని భర్తగానీ, అత్తమామలుగానీ చంపడానికి వీల్లేదు. ఆమె ఆదపడుచులే స్వయంగా మంచి రోజుచూసి కిర్సనాయిలు పోసి నిప్పంటించాలి." అంటూ ముగించాడు రెడ్డి.

శీతారామయ్యగారు చేతికర్రతో వణుకుతూ ఉత్సాహంగా కుర్చీలోనుంచి లేచి నిలబడ్డాడు. ఆయనకూడా ఏదో

చెప్పడానికి సరదాపడుతున్నాడని అందరికీ అర్థమయిపోయింది.

"మాది బాగా వెనకబడ్డ ప్రాంతం కదరా! అక్కడ ఇంకో సంప్రదాయం ఉంది! అదేంటంటే భర్త భార్యనుతగల బెట్టే రోజునే- అత్తగారినీ, తల్లిని కూడా చంపేయాలి ఆ తరువాత ఆ భర్తా, అతని తండ్రీ, మామగారూ- ముగ్గురూ ఒకే పందిట్లో మళ్ళీ పెళ్ళిళ్ల చేసుకోవాలి!"

హేమలతగారు ఠక్కున అందుకుంది,

"అవున్లెండి యెవరి సంప్రదాయం వాళ్ళది. మాలో పద్ధతి ఇంకోరకం. పెళ్ళయాక ఆమెను యెవరూ చంపరు. తనంతట తనే ఓ గదిలో కిరస్నాయిలు పోసుకుని నిప్పంటించుకొని చచ్చిపోవాలి. అప్పుడు భర్త ఆమె స్వహస్తాలతో "తన చావుకి యెవరూ బాధ్యులు కారనీ, అత్తమామలు, భర్తా, ఆడబడుచులు అంతా దేవతలూ- లేక దేవుళ్ళనీ- కేవలం తనకే సరదాపుట్టి ఛస్తోందనీ" రాసిన ఉత్తరం లగ్నం నాడు అతని ఉత్తరీయంలో కట్టి, మూటనుంచి తీసి పోలీసులకిస్తాడన్న మాట! అయితే ఆ ఉత్తరం అందుకునే పోలీస్ ఇన్‌స్పెక్టరుకి ఒక కానిస్టేబుల్‌కి మనం బట్టలు పెట్టాల్సి ఉంటుంది. పవిత్ర కార్యం గదా మరి!"

సీతారామయ్యగారికి పాతరోజులన్నీ మళ్ళీ కళ్ళముందు మెదిలినట్లున్నాయ్.

"ఇదే కాదురా ఆ రోజుల్లో భార్యలను ఇప్పటిలాగా డైరెక్ట్‌గా కాల్చేవాళ్ళు కాదు. ముందు కట్నాలగురించో మరో వస్తువు గురించో వియ్యాలవారితో వివాదం పెట్టుకునేవాళ్లు అవన్నీ మ్మతి భార్యను బాగావేధించాక అప్పుడు కిరస్నాయిలుపోసి నిప్పంటించేవారు. ఒకవేళ వియ్యాలవారు అడిగినవన్నీ ఇస్తే- ఆమెను చివరికంటా అసలు చంపేవారే కారు! అలాగే కాపురం చేయనిచ్చేవాళ్ళు. అంత అజ్ఞానం ఉండేదా రోజుల్లో"

ఈ గొడవంతా వింటూన్న పెళ్ళికొడుక్కి చిరాకు పుట్టుకొచ్చినట్లుంది చేతిలోని మంగళసూత్రం నేలకేసి కొట్టాడు.

"నేనేం హరికథలు వినడానికి రాలేదయ్యా! ముందు కిరసనాయిలు ఇస్తారా ఇవ్వరా తేల్చండి!" అన్నాడు మొండిగా.

సాయిరామ్ మళ్ళీ మంగళసూత్రం అతని చేతికిచ్చి సమాధానపర్చాడు.

---

✳ సినిమాహాలు బుకింగ్ క్లర్క్ : ఏమిటిది- ఇప్పటికిప్పుడే మీరు ఎనిమిదో టికెట్ కొంటున్నారు!

ప్రేక్షక చక్రవర్తి : తెలుసయ్యా బాబూ కానీ గేటుదగ్గర ఎవడో పిచ్చాడు నిలబడి నేను లోపలకు అడుగు పెట్టగానే నా టికెట్ లాక్కుని చింపేస్తున్నాడు.

# జుట్టుకు సిల్కువంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము...



శుద్ధమైన శీకాయిలోని సహజ లాభకర గుణములు స్వస్తిక్ శీకాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడటానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది. మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.




## స్వస్తిక్
# శీకాకాయ్ సబ్బు

ఇందులో శీకాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

"అలా తొందరపడితే యెలా గయ్యా! ఓ పక్కని మీ మావగారు ఇస్తానని వప్పుకున్నారుగదా! మీ అత్త గారికి యెలాగోలా నచ్చ జెప్తాంలే! అల్లరిపడకు-"

"మీరెంతసేపూ అంతఖర్చు ఇంత ఖర్చు అని గొడవేగాని మా పెళ్లి కొడుకుల సైడ్ కొంచెం కూడా ఆలోచించరండీ! పెళ్ళయిన తర్వాత షుమారు సంవత్సరం పాటు భార్యనుమేపి ఆ పెట్టుడికి దమ్మిడీ రాబడి రాకుండానే అంతేసి కిర్సనాయిలు పోసి కాల్చి చంపాలంటే యెవరికయినా యెంత కష్టం? పోసి అలా అని జీవితాంతం దానిని కాల్చకుండా బయటకు తోలేద్దామా అంటే లేనిపోని కాంప్లికేషన్స్ వస్తాయ్! అదీగాకుంటె మొదటి భార్య కిర్సనాయిలు పోసుకుని తగలెట్టుకున్న దని ఋజువు అయితేనేగాని మరో పిల్లనివ్వడానికి యెవరూ ముందుకి రారు. అయినా భార్యలతోపాటు కట్నంవస్తోం దన్న మాటే గాని పెద్దగా మాకుమిగిలి చచ్చేదెక్కడ? సంవత్సరం పాటు తిండీ, ఆ తరువాత కాల్చిచంపడానికి కిర్సనాయిలు, అగ్గిపెట్టెలు, దహన క్రియల ఖర్చులు, దినవారాలఖర్చులూ, అస్తికలు గంగలో కలపడాలు, ఇంట్లో పెద్ద ఫోటోలు ఫ్రేములు కట్టించి తగిలించడాలు- యెంత ఖర్చోమీరే లెఖ్ఖ వేసుకోండి గోపాలావుగారు ఈ విషయంలో యెంతో అభ్యుదయ భావాలున్న వారు కాబట్టి అడగ్గానే తక్కువ వప్పుకున్నాడు-" అన్నాడు పెళ్ళి కొడుకు!

మళ్ళీ శీతారామయ్యగారు అందుకున్నారు

"నన్నడిగితే భార్యలను కిర్సనాయిలుతో చంపడం మానేయడం మంచిదంటాను. ఎందుకంటే రాన్రాను కిర్సనాయిలు ధర తెగ పెరిగి పోతుంది. వేరే ఇంకేదయినా చౌకరకం ఆయిల్ ప్రభుత్వం సప్లయ్ చేయాలి. లేదా, అసలు ఆ కర్మ లేకుండా, చంపకుండా బానసలుగా అమ్మిపారేసే పద్ధతయినా బాగానే ఉంటుంది. ఇటువంటి పద్ధతి వల్ల అటు ఖర్చు తప్పుతుంది. ఇటు కొంత రాబడీ ఉంటుంది. మరో పక్క కొన్నవాడికి గొడ్లకు బదులుగా స్త్రీలను ఉపయోగించుకుని లాభపడే అవకాశమూ ఉంటుంది. ఈ పద్ధతి ఇప్పటికే కొన్ని దేశాల్లో అమలులో ఉంది-"

ఆ మాట పూర్తికాకుండానే ఆడాళ్ళంతా ఏకమయి శీతారామయ్య మీద విరుచుకు పడ్డారు.

"అలా జరగడానికి వీల్లేదు. ఆడాళ్ళు పశువులు కాదు- అలా బానిసలుగా అమ్మిపారేయడానికి, భర్తచేతిలో కిర్సనాయిలు చావు చావడం మా జన్మహక్కు. ఇది మా భారతదేశ సాంప్రదాయం మా నాగరికత, ప్రపంచంలోకెల్ల గొప్పదయిన, మన ఆచారాలు తొలగించడానికి మేమం ససేమిరా వప్పుకోము .." అంటూ ఆవేశంగా అరచారు

పరిస్థితి విషమించేలా ఉండటం శాయిరామ్ చిరునవ్వుతో మధ్యలో కొచ్చాడు.

"సోదరులారా, సోదరీమణులారా, మనలో మనకి గొడవెందుకు? మనం అటు గోపాలరావ్‌గారి కార్యవాదనమూ కొట్టేయడానికి వీల్లేదు. ఇటు పెళ్ళికొడుకూ, అతని తండ్రి అండ్‌కంపెనీ వాళ్ళు అడిగేదానికి కాదనలేము ఎందుకంటే మనందరికీ కూతుళ్ళతో పాటు కొడుకులూ ఉన్నారు మన కూతురూ ఒకింటికి కోడలయినట్లే, ఒకింటి కూతురూ మనింటికి కోడలుగా రాక తప్పదు, మరి మనింటి కోడళ్ళను మనమే స్వయంగా కిరసనాయిలు పోసి నిప్పంటించడమూ సహజమే, అంటే మరి మనకూ ఖర్చు పెరుగుతుంది కదా, కనుక మనందరం ఓ కొత్త పద్ధతి అవలంబిస్తే బావుంటుంది. అదేమిటంటే పెళ్ళికొడుక్కి ఒకేసారి ముగ్గురమ్మాయిలతో పెళ్ళిచేసి పారేస్తే- అటుముగ్గురి కట్నం ఒకేసారి వస్తుంది- ఇటు వాళ్ళందరినీ ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో చంపే పద్ధతి బదులు ఒకేసారి కట్టకట్టి కిరసనాయిలు పోసి అంటిస్తే ఖర్చు పూర్తిగా తగ్గిపోతుంది, ఎందుకని? అందరికీ కామన్‌గా దహనక్రియలు, కామన్‌గా దినవారాలు, అందరి అబ్దికాలూ, ఒకచేసారి గంగలో కలపడం, ఆ తరువాత ఆ ఫొటోలకు జీవితాంతం జరిపే పూజల ఖర్చు కామన్ - ఇలా ఎంత లాభమో చూడండి ..."

ఓక్షణం అంతా నిశ్శబ్దం అలుముకుంది, ఆ తరువాత ఎవరికి వాళ్ళు పక్కవాళ్ళతో తర్కించుకోవడం ప్రారంభమయింది ...



"మీరు చెప్పింది చాలా బావుంది అన్నయ్య గారూ," అంది రాజేశ్వరి ఆడాళ్ళ తరపున.

"అవును-" అన్నారు మిగతా రు.

"మీరే మంటా రండీ." అంటూ బట్టతల నడిగాడు సాయిరామ్

"గాడిద గుడ్డంటాను -" మండి పడుతూ అన్నాడాయన

"అదేమిటి ?"

"లేపోతే ఏమిటయ్యా, నాక్కావలసింది మీ బోడి సంస్కరణలు కాదు కిరసనాయిలు ఇప్పుడు ఇస్తారా లేదా, అంతే, ఒక్కటే జవాబు కావాలి."

"ఇవ్వకపోతే ఏం జేస్తావ్ ?" అన్నాడు మా కాలనీ యువజన నాయకుడు సంగీతరావ్.

"ఏంజేస్తానా ? 'ధూ' అని ఊసి పెళ్ళి చేసుకోకుండా ఇక్కడి నుంచి వెళ్ళిపోతాం "

"వెళ్ళడానికి నీకు కాళ్ళులేవుగా-"

"కాళ్ళులేక పోడమేమిటి ? ఇవి కాళ్ళు కాదు ?"

"ఇప్పుడు న్నాయండీ 'ధూ' అని ఊసి బయల్దేరాక ఇంక అవెందుకుంటు తాం మీము అవి విరగొట్టి ఇక్కడే ఓమూల కుప్ప పడేస్తాం."

"ఏంట్రా ? నా కాళ్ళు విరగ్గొడతావా ?" అంటూ అతని మీదకు దూకాడు కట్టాకల

అంతే, ఆ తరువాత ఏంజరిగిందో తెలీదు కుర్చీలు, బల్లలూ, స్టీలుచెంబులూ, గ్లాసులూ అన్నీ తుఫాను గాలికెగిరినట్లు గాలిలోకి ఎగిరిపడే వరకే నాకు గుర్తుంది. అందులో ఒకచెంబు ఎగిరి వచ్చి బలంగా నా నెత్తికి కొట్టుకొనటం కూడా కొంచెం గుర్తుంది, తిరిగి కళ్ళు విప్పేప్పటికి మా ఇంట్లో - నా గదిలో మంచం మీద పడి ఉన్నాను-

మా ఇంటి సభ్యులందరూ నాచుట్టూ మూగి విచిత్రంగా చూస్తున్నారు నా పక్కనే పడివున్న ఇండియన్ ఎక్స్ ప్రెస్ పేపర్లో మొదటిపేజీలో "ఇంకో పెళ్ళికూతురిని తగలేశారు " అన్న హెడ్డింగ్ ఇంగ్లీష్‌లో [illegible]. లోపల్నుంచి రేడియోలో - [illegible] కల కాదుసుమా అన్నపాట [illegible] తోంది.

## ....ఒక్క మాట ఇలా....

ఈ కథ మీకు హాస్యం అందిస్తే అందించవచ్చు!

కానీ "ఈ కథ నేను మన దేశంలోని స్త్రీ పరిస్థితి చూసి నవ్వాలో ఏడవాలో తెలీక రాశాను.

సినిమాల్లో చూద్దామా - తాగి తనను చితక తంతున్నా, భర్త కాళ్ల పట్టుకుని వదలని పాత్రలు - భర్తను మరో స్త్రీకి మనం చూస్తూండగానే త్యాగం చేసి పారేసే పాత్రలు-

బయట చూద్దామా, కట్నాలాంఛనాల కోసం - అత్తమామలు, భర్త పెట్టే బాధలు భరించలేక ఆత్మహత్యలు చేసుకోవడం - లేదా హత్య గావించ బడటం-

ఇవన్నీ అలావుంచి ఈ పరిస్థితిని రాస్తాను అందరూ చాలా మామూలు విషయాల్లా - కాజువల్‌గా ట్రీట్ చేయడం - ఇదీ ప్రమాదకరమైన పరిస్థితి .

ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే - ఈ కథ త్వరలోనే నిజమై పోవడం ఖాయం ! అప్పుడింక నవ్వుకోడానికేమీ మిగలదు

—రచయిత

# ప్రణయ వీచికలు

## మూలం: బార్బరా కార్ట్‌లాండ్
## స్వేచ్ఛానువాదం: వాసిరెడ్డి సీతాదేవి

"నిజాం రెసిడెన్సీకి వస్తుంటారా?"

"వస్తారు. ఏనుగు ఎక్కి వస్తారు. ఆయనకు ఇరువైపులా ఇద్దరు తమ్ముళ్ళు కూడా ఉంటారు. వాళ్ళు కూడా ఏనుగుమీదే ఉంటారు."

"నాకు చూడాలని ఉంది. నేను ఇక్కడ ఉండగా నైజాం వస్తారని ఆశిస్తున్నాను."

మిస్టర్ ఐవెన్స్ చిరునవ్వు నవ్వాడు

"రావచ్చు. నిజాం ఇంకా మైనరే. త్వరలోనే మేజర్ కాబోతున్నాడు వైస్రాయ్ నిజాంను సింహాసనం మీద కూర్చోబెడతారు. అప్పుడు పెద్ద ఫంక్షన్ చేస్తారు"

"వైస్రాయ్ ఇక్కడకు త్వరలో రాబోతున్నారా?"

"అవును! ఆ ఉత్సవం చాలా అద్భుతంగా వుంటుంది. నువ్వు కలలో కూడా ఊహించనంత బ్రహ్మాండంగా ఉంటుంది.

"నేను చూస్తాను." సీత ఆనందంతో చిన్నపిల్లలా చప్పట్లు కొట్టింది.

ఆ పిల్ల సంతోషాన్ని చూస్తూ ముసిముసిగా నవ్వుకొన్నాడు మిస్టర్ ఐవెన్స్.

★ ———— జరిగిన కథ ———— ★

(హార్వే, సీతా హైదరాబాదు బయల్దేరారు, అద్భుతమైన నగరంలో "రెసిడెన్సీ"కి చేరారు. అక్కడ రెసిడెంట్ కిర్క్ పాట్రిక్ ప్రేమకథలనీ, నిజాంని అందంగా తనమాట చెల్లించేలా చేసుకున్న తీరునూ, ఖైరున్నీసాబేగం కథనీ రెసిడెన్సీ సౌందర్యాన్ని కథగా వింటోంది సీత)

"బాబాయ్ ఈ సమయంలో మనం ఇక్కడకు రావటం మన అదృష్టంగా [illegible]."

[illegible]రాలసి అనేమాట అన్నారు. నేను సమయానికి రావడంవల్ల వాళ్ళ [illegible] [illegible]చి [illegible]ందని [illegible] నమ్మకం. కలకత్తాలో కొన్ని విషయాలే [illegible], ఆయన ఇక్కడకు వస్తే ఆ గిల్లుమీద కూలంకషంగా చర్చించడానికి [illegible] ఉంటుంది." ఎంతో తాపీగా సమాధానం ఇచ్చాడు మిస్టర్ హార్వే.

[illegible] మిస్టర్ హార్వేను ప్రశ్నించే ధైర్యం ఇండియాకు రాకముందు [illegible]. అవసరం అయి ఏదైనా అడిగితే మిస్టర్ హార్వే కసురుకొనే [illegible] తను తన బాబాయి తన ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వడం ఎంతో [illegible] కలిగిస్తున్నది. అకస్మాత్తుగా తన వ్యక్తిత్వం కూడా పెరిగిపోయి [illegible] [illegible]సాగింది.

"అవును! మీరు సమయానికి ఇక్కడకు రావడం వల్లే వాళ్ళకు ఎంతో [illegible]నట్టు అయింది." అన్నది సీత తన బాబాయి ముందు తన అభిప్రాయం చెప్పే అవకాశాన్ని జారవిడుచుకోకుండా. మిస్టర్ హార్వేతో తను అలా మాట్లాడగలగడం ఓ గొప్ప థ్రిల్‌గా అనిపిస్తోంది ఆమెకు.

"అవును!" మిస్టర్ హార్వే గంభీరంగా తలపంకించాడు.

ఇంత అదృష్టం తన బాబాయికి పట్టడానికి కారణం అతను పూర్వజన్మలో చేసిన కర్మకు ప్రతిఫలమని భావించింది.

కర్మ గురించి ప్రత్యేకంగా తెలియకపోయినా ఆమెకు ఆమాట హిప్నటిక్ సజెషన్‌లా పనిచేస్తున్నది.

బాబాయి చెడ్డవాడు కాడు. ఇక్కడకు వచ్చినప్పటినుంచి ఎంతో సంతోషంగా ఉన్నాడు. అందుకే తనతో అంత ఆప్యాయంగా మాట్లాడుతున్నాడు. ఇంగ్లాండులో ఉండగా ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్న వాడిలా ఉండేవాడు. అందుకే మాటకు ముందు చిరాకు పడేవాడు. దీన్ని కూడా కర్మ అనే అంటారు.

అతను-అదే కర్మ గురించి చెప్పిన స్నేహితుడు కన్పిస్తే బాబాయి ప్రవర్తనలో వచ్చిన మార్పు గురించి చెప్పాలి. అతను సంతోషిస్తాడు. అతనికిముందే తెలుసేమో! అన్ని విషయాలు అతను ముందుగానే ఊహించి చెబుతున్నాడుగా, మిస్టర్ హార్వే ఇక తనను బాధించడని కూడా చెప్పాడు. ఏలా చెప్పగలడు? అతనిలో ఏవో అతీతశక్తులున్నాయి.

మనిషి తను సంతృప్తిగా సుఖంగా ఉన్నప్పుడే చుట్టూ వాళ్ళను ప్రేమిస్తాడు.

ప్రేమ చాలా గొప్పది.

ఈ రెసిడెన్సీని కట్టించిన కిర్క్ పాట్రిక్‌కు ప్రేమించడం తెలుసు అందుకే అతని గురించి, అతని పరిష్కన్ వైఫ్ గురించి కథలు చెప్పుకుంటూ ఈనాటికీ ఆనందిస్తున్నారు వాళ్ళ ప్రేమ శాశ్వతం. అమరం అలాంటి ప్రేమ తనకు లభిస్తుందా?

ఒంటరిగా ఉన్నప్పుడు సీత ఎక్కువగా కిర్క్ పాట్రిక్ ప్రేమకథను మననం చేసుకుంటూ ఉంటుంది.

ఆ రెసిడెన్సీలో చాలామంది ఆంగ్లేయులు ఉన్నారు. అందులో విల్‌ఫ్రెడ్ స్కావెన్ బ్లన్ అనే అతను కవి అతని భార్య పేరు అనీ ఆమె లార్డ్ బైరన్‌కు మనుమరాలు. ఆమె ధనవంతురాలు. బ్లన్‌కు పెద్దగా డబ్బు దురాశ ఉన్నప్పటికిన్నీ కాస్తకూడా తగలేశాడు.

పొగరుగా కన్పిస్తాడు. బ్రిటిష్ అధీనంలో ఉన్న అన్ని దేశాలకూ హోమ్ రూలును అమలుపరచాలని అంటూ ఉంటాడు.

అతను ఈజిప్టు పొలిటికల్ పరిస్థితుల్లో కలుగజేసుకొని అభాసుపాలయ్యారు ప్రస్తుతం ఇండియాలో బ్రిటిష్ వాళ్ళ పతనాన్ని పెంచటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇండియన్స్‌ను హీనంగా చూస్తారు. బానిసలకూ పశువులకూ తేడాలేదంటాడు.

టిపూసాహెబ్ మనమడు జడ్జిగా ఉండికూడా బ్లన్ అంటే భయపడేవాడు. అవును! మరి! అతను జడ్జిగా ఉండటం ఉండపోవడం ఇంగ్లీషువాడి ఇష్టాయిష్టాలమీద ఆధారపడి ఉన్నదయె!

అసలు ఇండియన్ సివిల్ సర్వీస్‌ను అబాలిష్ చెయ్యాలని విల్‌ఫ్రెడ్‌బ్లన్ సలహా ఇచ్చాడు, అతని సలహాకు కొందరు చాటుగా నవ్వుకొన్నారు.

మిస్టర్ హార్వే ఇండియాకు ఎందుకు వచ్చారో అతనికి తెలుసు వస్తూ వస్తూ వైస్రాయ్ ఆతిథ్యాన్ని పొంది వచ్చాడని తెలుసు.

ఆంగ్లో ఇండియన్స్ గురించి ఎందుకంతగా ఆలోచించాలో నాకు అర్థం కావంలేదు." బ్లన్ విసుగ్గా అనడం సీత విన్నది. బ్లన్ మాటల్ని ఎవరూ ఖండించక పోవడం ఆమెకు ఆశ్చర్యంగానే అనిపించింది.

"అందువల్ల లాభం లేకపోగా నష్టమే ఎక్కువ." అని సీత సందేహానికి సమాధానం వచ్చింది.

బ్లన్‌కు ఇండియన్స్ సివిల్ సర్వీస్‌లో ఉండటం ఇష్టంలేదు. ఎందుకని? సీత బుర్రలో ఎన్నో సందేహాలు!

ఆమెకు షివ్‌లాలుకు స్నేహితుడు గుర్తువచ్చాడు.




ఆరోజు డిన్నర్‌లో బ్లన్ చాలా ఉద్రేకంగా మాట్లాడం చూసింది. ఒక డ్రామాలోని పాత్రలా మాట్లాడుతున్నాడు అనుకొన్నది.

అతను అలా ప్రవర్తించడానికి కారణం బర్నెస్‌ను అడిగింది.

"మన కవిగారు ఇవ్వాళ ఏదేదో వాగాడు. భారతీయుల్ని కించపరుస్తూ మాట్లాడాడు." అతనికి ఇండియన్స్ అంటే అసహ్యం అని అర్థం చేసుకొన్నది—

మిస్టర్ హార్వే చాలా బిసీగా ఉన్నాడు. సీత గురించి పట్టించుకొనే తీరిక లేదు. సీతకు నగరం చూడాలనిపించింది. మిస్టర్ బర్నెస్‌తో చెప్పింది.

తనకు గుర్రపుస్వారీ బాగా వచ్చునని, నగరం వెలుపల ఉన్న చారిత్రాత్మక స్థలాలను చూడటానికి గుర్రాన్ని సిద్ధంచేయమనీ అడిగింది. బర్నెస్ వెంటనే అంగీకరించాడు.

"తప్పకుండా! కుతుబ్‌షాహీ వంశజుల సమాధుల్ని చూపిస్తాను. నేను కూడా వస్తాను, అవిచూసి నువ్వు థ్రిల్ అవుతావని నాకుతెలుసు." అన్నాడు బర్నెస్.

"వండర్‌ఫుల్!" పసిపిల్లలా కేరింతలు కొట్టింది సీత. ఆ రాత్రంతా సీత నిద్రపోలేదు.

జోక్రె

అన్ని ఏర్పాట్లూ చేశాడు బర్నెస్. అతను ఆమెతో వెళ్లలేక పోయాడు. ఇద్దరు సైనికులను ఇచ్చి పంపించాడు మరునాడు టూంబ్స్ చూడటానికి.

సీత గుర్రం ఎక్కింది. ఆనందంతో ఆమె ముఖం విప్పారింది. మనసు ఉరకలు వేసింది.

ఆమె తను అలావెళ్తున్నట్టు మిస్టర్ హార్వేకు చెప్పలేదు. చెబితే అతను అంగీకరించడని తెలుసు, అంత అంగీకరించినా తనుకూడా ఉండి ఏ బండి మీదో తీసుకెళ్తాడని ఆమెకు తెలుసు.

సీతకు గుర్రపుస్వారీలో మంచి ప్రావీణ్యత ఉన్నది. తండ్రి బ్రతికిఉన్న రోజుల్లో రోజూ రెండు మూడు గంటలు గుర్రం మీద స్వారీ చేసేది.
సీత తనకోసం ఏర్పాటుచేసిన గుర్రాన్ని చూసింది మంచి ట్రైనింగ్ ఇవ్వ బడిన గుర్రం కావడం వల్ల సీతకు దాన్ని మచ్చిక చేసుకోవడానికి అట్టేకష్ట పడాల్సిన అవసరం లేకపోయింది.

ఆమెతో పాటు ఇరుపక్కల ఇద్దరు రక్షక అధికారులు కూడా బయలు దేరారు. వారిలో వయసుమళ్ళిన వ్యక్తి సీతకు ఒక్కొక్కటే వివరంగా చెబు తున్నాడు. గోల్కొండ కోట దూరంగా కన్పించింది. టైముంటే అదికూడా చూడాలనుకొన్నది సీత.

"ఆ కోట అజేయం! అపూర్వం! మేమ్‌సాహెబ్!" ఆ ముస్లిం వృద్ధుడి కంఠస్వరంలో నుండి గర్వం తొంగిచూసింది.

"ఒకే ఒక్కసారి మోసంతో ఆ కోటను శత్రువులు జయించ గలిగారు." మళ్లీ అతనే అన్నాడు.

"కుతుబ్‌షాహీ రాజుల రాజధాని కదూ?" సీత ప్రశ్నించింది.

"అవును!"

"మరో రోజువచ్చి ఆ కోట వివరంగా చూస్తాను.

"అలాగే మేమ్‌సాహెబ్! నేనే వస్తాను నాకు ఆ కోటను గురించి, అంగుళం అంగుళం తెలుసు" గర్వంగా అన్నాడు వృద్ధసిపాయి.

సీత అతన్నిచూస్తూ చిరునవ్వు నవ్వింది

అల్లంత దూరంలో కుతుబ్‌షాహీ సమాధుల గుమ్మటాలు కన్పిస్తున్నాయి. సీత మనసు చిత్రమైన అనుభవంతో నిండి యింది.

సమాధుల దగ్గర సీత తన గుర్రాన్ని సిపాయిలకు అప్పగించింది,

"మీరు ఇక్కడే ఉండండి, నేను ఒంటరిగావెళ్ళి చూసివస్తాను" అన్నది.

"సెబాష్ రేఖా, నీది మహా చక్కని సృష్టి... నీ డ్రెస్ పైనే అందరిదీ ఒకే దృష్టి!"









# హై పవర్ సర్ఫ్
# అమిత తెల్లగా ఉతుకుతుంది
# ...అమిత తెల్లగా, కనువిందుగా!

**తెల్ల బట్టలకి సెబాష్ తెలుపు,**
**రంగు బట్టలకి సెబాష్ గెలుపు**

"మేమేసాహిబ్ మీకు...."
"ఎవరూ చెప్పక్కర్లేదు. నేనే చూస్తాను". సీతకు ఆ వాతావరణంతో మరొకరితో మాట్లాడాలని లేదు.
వంటరిగా ముందుకు నడిచింది
ఆ సమాధులు చిన్నపాటి ఇళ్లలా ఉన్నాయి. వాటిమీద చెక్కిన లతలనూ పూలనూ కళ్లు పెద్దవిచేసుకొని చూసింది. సమాధులు కూడా ఇంత శిల్ప నైపుణ్యాని కలిగి ఉన్నాయి. అద్భుతం!
మొదటి సమాధి తెరిచి ఉన్నవాకిటిద్వారా లోపలకు అడుగు పెట్టింది. చల్లగా ఉన్నది లోపలి వాతావరణం వెనక్కు తిరిగి చూసింది. దూరంగా సిపాయిలు చెట్టు కింద విశ్రాంతి తీసుకొంటున్నారు.
సమాధి చుట్టూ తిరుగుతున్నప్పుడు ఆమెకు చిత్రమైన భావం కలిగింది. అక్కడ తను వంటరిగాలేదు. ఏదో అతీతమైన శక్తి తనను చూస్తున్నట్టుగా అన్పించింది.
సమాధి దగ్గరగా వెళ్ళినిల్చుంది. ఈ బండ కింద ఓ మహారాజు తాలుకు శిధిలాలు ఉన్నాయి! ఆ భావంరాగానే ఆమె మనసులో ఏదో దిగులు పొడ సూపింది. భయం మాత్రం కలగలేదు.
ఆమె మెట్లు దిగి వచ్చింది.
రెండో సమాధి భవనంమెట్లు ఎక్క సాగింది. ఆ సమాధినుంచి వెనక్కు చూస్తే సిపాయిలు కన్పించలేదు. అయినా ఆమెకు తను వంటరిగా ఉన్నట్టుగా అన్పించడంలేదు. ఎవరో కూడా ఉన్నట్టుగా అన్పించింది.
ఎవరు?
చనిపోయిన వారి ఆత్మలా?
అవును!
సమాధుల్లో వున్న వారి తాలుకు ఆత్మలు ఇంకా అక్కడ తిరుగుతూనే ఉన్నట్టుగా అన్పించింది. అయినా ఆమెకు భయంకలగలేదు.
మూడో సమాధి దగ్గిరకు వెళ్ళింది.
అది అన్నిటి కంటే కొంచెం దూరంలో ప్రత్యేకంగా ఉన్నది. ఆ కట్టడం కూడా మిగతా వాటి కంటే ఆకర్షణీయంగా ఉన్నది. పెద్దగా ఉన్నది. ఆనాటి శిల్పులు తమ నైపుణ్యాన్నంతా దానిమీద ఖర్చు చేశారా అన్నట్టుగా ఉంది.
ఆమె లోపలకు అడుగు పెట్టింది. అలాగే చిత్రంలా నిలిచి పోయింది.




ఒక మూల నీడలో ఏదో ఆకారం కన్పించింది.

సీతకు వెన్నెముకలో నుంచి ఏదో జరజరపాకినట్టుగా అయింది.

అరవాలనుకొన్నది.

గొంతు పెగలడంలేదు.

పెదవులు ఎండిపోయాయి.

నాలుకతో తడుపుకొన్నది.

వెనక్కు పరుగుతియ్యాలనుకొన్నది. కాని కాళ్లు స్వాధీనంలో లేవు.

ఆ ఆకారం కదిలింది.

నో! నో! అది దెయ్యంకాదు!

మనిషే!

అవును! పొడవుగా ఉన్న మగవాడు!

ఇటే వస్తున్నాడు.

సీతకు వళ్ళంతా చెమట్లు పట్టాయి.

కళ్లు తిరిగాయి.

ముందుకు తూలింది.

ఎప్పుడు కళ్లు తెరిచిందో ఆమెకే తెలియదు.

"సీతా! నేను! ఇటు చూడు! భయంలేదు."

ఆ కంఠం....ఆ కంఠం....అవును అతనిదే! తను ఎక్కడున్నది? అతని తొడమీద తలపెట్టుకొని పడుకొని ఉన్నది.

సీత చివ్వున లేచి కూర్చుంది.

కళ్లు పెద్దవి చేసి చూసింది.

అతను చిరు నవ్వు నవ్వాడు.

"నువ్వు....నువ్వు...."

"అవును....నేనే.... అంతభయపడిపోయావేం?"

ఇతను ఇక్కడ ఎందుకున్నాడు?

ఇతను . .మనిషి కాదా?

తను టూంబ్స్‌లో ప్రవేశించినప్పటినుంచీ తనకూడా ఎవరో ఉన్నట్టుగానే అన్పించింది.

"సీతా ఏమిటి అలా చూస్తావ్? నేను దెయ్యాన్ని కాదు. మనిషినే! నీకు డెక్‌మీద కన్పించిన స్నేహితుడ్ని, భయపడకు." లాలనగా అన్నాడు అతను.

అవును! అతనే!

కాని.... కాని?

"నువ్వు .... ఇక్కడ .... ఎందు ... కున్నావ్?" ఎలాగో అనగలిగింది సీత.

"నువ్వు వస్తావని... "

సీత కళ్లు పెదల్పు చేసుకొని చూసింది.

"నీకెలా తెలుసు?"

"నాకు తెలుసు నీకు నా అవసరం ఉన్నదని కూడా తెలుసు. ఈ రెండు రోజుల్నుంచి నేను కన్పిస్తే బాగుండును అని ఎన్నోసార్లు అనుకొన్నావు. అవునా?"

సీత తల ఆడించింది.

"నేను ఇక్కడకు వస్తున్నట్టు నీకు ఎవరు చెప్పారు.'' సీత కొంత తేరుకున్నది.

"ఎవరు చెబితే ఏంలే? నేను రావడం నీకు ఇష్టం లేదా? చెప్పు వెళ్ళిపోతాను"

"ఇష్టమే?''

"అయితే లే?" అతను చెయ్యి అందించాడు.

సీత భయం తీరిపోయింది.

అనవసరంగా భయపడినందుకు సిగ్గుగా ఉన్నది.

ఆమె చెయ్యి పట్టుకొని అతను ఆమెను బయటికి నడిపించుకొని వచ్చారు.

అక్కడ వున్న సిమెంటు బెంచీమీద ఇద్దరూ పక్కపక్కగా కూర్చున్నారు.

"మీరు కలకత్తాలో కనిపిస్తారను కొన్నాను. ఇక మళ్ళీ కనిపిస్తారను కోలేదు." అతని ముఖంలోకి చూస్తూ అన్నది సీత.

అతను చిరునవ్వు నవ్వాడు

సీత అతన్ని మొదటిసారిగా వెలుగులో చూసింది.

"చాలా అందంగా ఉన్నాడు. అతని నవ్వు మరీ అందంగా ఉంది." మనసులోనే అనుకున్నది సీత.

అతన్ని పరిశీలనగా చూసింది.

అతని శరీరపు రంగు ఇంగ్లీషు వాళ్ళ రంగు కంటే కొంచెం తక్కువగా ఉంది.

"భారతీయులు కూడా ఆర్యులే మనలాగ. నల్లటి వాళ్ళేకాదు భారతీయులో తెల్లగా ఉండే వాళ్ళు కూడా ఉన్నారు. అయితే మనంత తెల్లగా ఉండరు. కారణం ఆదేశపు వాతావరణం అని సీతకు ఒకసారి ఆమె తండ్రి చెప్పాడు ఆ మాటలు గుర్తొచ్చాయి.

"ఇతను భారతీయుడే అయి వుండాలి." అనుకొన్నది.

✻ వింతైన వంటకంబు ✻



తోటి మనుషుల్ని తినే తెగలు ఆఫ్రికాలో తెగ ఉన్నాయని మీకు తెలుసా? ఏమిటి? (ఆ పని ఇక్కడ మన రాజకీయనాయకులే చేస్తున్నారంటారా? అప్పు ఆ సంగతి వేరు.) ఇటీవల సేకరించిన లెక్క ప్రకారం ఆఫ్రికన్ కానిబల్స్ చేత (లేదా నోట) బక్క 68 కిలోల బరువున్న మనిషిని 75 మంది శుభ్రంగా భోజనం చేసి 'బ్రేవ్' మని త్రేన్చ గలరట!



"నాకు కన్పించకుండా షిప్‌దిగి వెళ్ళిపోయావు. మాట మాత్రంగా కూడా చెప్పలేదు. నేను ఎంత బాధ పడ్డానో తెలుసా?"

అతను మళ్ళీ చిరునవ్వు నవ్వాడు.

"చెప్పవేం? ఎందుకలా వెళ్ళిపోయావ్?"

"సమయం వచ్చినప్పుడు నీకే తెలుస్తుంది. ఇంకా ఎన్నో విషయాలు నా గురించి తెలుస్తాయి. అది సరే? నువ్వెలా ఉన్నావ్? సంతోషంగా ఉన్నావు గదూ? మీ బాబాయి నిన్ను సతాయించడంలేదు. అవునా?"

ఆమె కళ్లు మిలమిలలాడాయి.

"అవును? ఆరోజు నువ్వు నన్ను రక్షించకపోతే ఈ ఆనందం పొంద గలిగేదాన్నా? మీరు చెప్పిన మాటలు నిత్యం మననం చేసుకొంటున్నాను. అవును? జీవితం అనుభవించడానికే. జీవితం విలువైనది మనంకోరితే లభించిందికాదు. అటువంటప్పుడు దాన్ని తుదముట్టించే అధికారం మనకులేదు. మీరు ఎంత బాగా చెప్పారు!" తన్మయంగా అతని ముఖం లోకి చూస్తూ అన్నది.

అతను సమాధానం ఇవ్వలేదు.

"నువ్వు పక్కన ఉంటే జీవితానికి ఓ అర్థం ఉన్నట్టు నాకు అన్పిస్తోంది ఎన్నియుగాలైనా ఇలాగే ఉండి పోగలననిపిస్తోంది, మీరు నాకు తరచు కన్పించాలి. ఎన్నో విషయాలు అడగాలి. ఎన్నో తెలుసుకోవాలి. నా ప్రశ్నలకు సందేహాలకు సమాధానాలు మీరే ఇవ్వగలరనిపిస్తోంది"

"ఎందుకనో?" తమాషాగా చూస్తూ అన్నాడు,

ఆమె చూపులు సిగ్గుతో వాలిపోయాయి!

"ఏమో! నాకు అలా అన్పిస్తున్నది. మీరు కన్పించడం--"

"కర్మ కారణం—నేను నీకు కల్పించడం వల్ల నీకు జీవితం మీద ఆసక్తి ఏర్పడింది, అవునా?"

"అవును! మొదటి సమాధిలోకి రాగానే నువ్వే గుర్తొచ్చావు. ఇండియాలో మనవాతీతమైన అనుభవాలు చాలా వుంటాయన్నావు కదూ?"

"స్పిరిచ్యువల్—"

"అవును! ఇక్కడకు వచ్చినప్పటినుంచి నాకు అలాగే అన్పిస్తోంది."

''చాలా సంతోషం! సమాధుల్లో నీకు కేవలం రాళ్ల మాత్రమే కన్పించక పోవడం — ఏదో అలౌకిక అస్తిత్వాన్ని లీలగా అనుభవించడం — నాకు సంతోషంగా ఉంది." అన్నాడు అతను.

"అవును! నేను మాటల్లో చెప్పలేక పోతున్నాను. ఆ సమాధుల్లో చచ్చి పోయిన వాళ్ళ తాలూకు అవశేషాలు మాత్రమే ఉన్నట్టుగా నాకు అన్పించలేదు వాళ్ళింకా బ్రతికి ఉన్నట్టూ, వచ్చే పోయేవాళ్ళను గమనిస్తున్నట్టూ అన్పించింది అన్నది సీత తన అనుభవాన్ని మననం చేసుకుంటూ.

"ఇలాంటి అనుభవాలు చెప్పడానికి మనిషికి వచ్చిన భాష చాలదు. ఆ అనుభూతిని స్వయంగా తెలుసుకోవలసినదే కాని తెలియజెప్పేదికాదు — అది సరే! రెసిడెన్సీ గురించి నీ అభిప్రాయం ఏమిటి?" మాట మారుస్తూ అడిగాడు.

"రియల్లీ థ్రిల్లింగ్." ఉద్రేకంగా అన్నది.

అతను ఆమె ముఖంలోకి చూశాడు. చిరునవ్వు నవ్వాడు. తాపీగా నవ్వాడు.

"నీకు ఎవరో ఆ రెసిడెన్సీ తాలూకు ప్రేమ కథలు విన్పిస్తున్నారుగదూ?"

సీత తృళ్ళిపడి అతని ముఖంలోకి చూసింది.

"నీకెలా తెలుసు?"

"తెలుసు" అన్నట్టుగా చిరునవ్వు నవ్వాడు.

"కథలు ఎలా ఉన్నాయి?"

"రియల్లీ రొమాంటిక్!''

"అలాగా?'' అదోలా చూస్తూ అన్నాడు.

"అవును! ఆ కథలు నువ్వే అక్కడుండి చెప్పగలిగితే ఇంకా థ్రిల్లింగ్‌గా ఉంటాయి." ఆమె మాటలు అనేసి అంతలోకి నాలుక కరచుకొంది. కింది చూపులు చూడ సాగింది. బుగ్గల్లో వెచ్చటి రక్తం చిమ్మింది.

"అక్కడ చాలామంది ఉన్నారుగా నీ సందేహాలను తీర్చేవాళ్ళు" అతని అతని కంఠం నిర్లిప్తంగా పలికింది.

సీత చివ్వున తలెత్తి చూసింది. (సశేషం)




# షిబలోక్ సంతతి

రష్యన్:
నికొలాయ్ షొలొహొవ్

తెలుగు:
వుప్పల లక్ష్మణరావు

"నువ్వు చదువుకున్న ఆడదానివి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నావు. ఐనా వీడు బుద్ధి తక్కువే. వీడితో నేనెక్కడికి పోయేది?

ఇక్కడ నుంచి మ్యాట్రూపుకి ఓ నలభై వెర్స్తులుంటుంది. వీణ్ణెత్తుకుని నడిచొచ్చాను. కాళ్ళ చర్మం తొక్కల్లా యెలా వూడొచ్చేసిందో చూశావా? ఈ శిశు శరణాలయం మేనేజరువి కదా, యీ చంటాణ్ణి తీసుకో మరి! ఖాళీ లేదంటావా? వీణ్ణి తీసుకుని మరి నన్నెక్కడికి పొమ్మంటావ్? వీణ్ణి మోసి మోసి ఇప్పటికే పడ్డాను కావలసినన్ని యమయాతనలు. పీకమొయ్యా దిగమింగాను బాధలు. అవును, వీడు నా తన్నకొడుకు. నా సంతతి. నా వంశాన్ని నిలబెట్టవలసిన వాడు. వీడికిప్పుడు రెండో యేడు. మరి తల్లి చచ్చిపోయింది. వీడి తల్లిది—అదో చిత్రమైన కథ. ఎందుకు చెప్పకూడదు? చెబుతా. పోయిన యేడు నేనున్న కంపెనీకి ఓ ప్రత్యేకమైన పని ఒప్పజెప్పారు. ఆరోజుల్లో ఎగువ దొన్ ప్రాంతంలో స్వైర విహారం చేస్తున్న ఇగ్నాతియల్ మురాని కొసాక్ గ్రామాల్లోకి తరిమి కొట్టాం. నేను—ఖచ్చితంగా చెప్పాలంటే—మెషిన్ గన్నరుగా వుండేవాణ్ణి. ఓనాడు మేం గూడెం వదిలిపెట్టి దాడి చేసేందుకు బయల్దేరాం. స్టెప్ మైదానం మీద చెట్టూ చేమా లేకుండా ఒట్టతలవాడి గుండులా వుంది. ఎండ మాడ్చేస్తూంది దిబ్బ యెక్కేశాం. ఇక కొండకి కాస్త దిగువగా వున్న చిట్టడవి చేరుకోవాలి. నేనేమో నా మెషీన్ గన్ను శకటంతో అందరికంటె ముందు చూసుకొంటే దిగువ అల్లంత దూరాన ఏదో పడుంది. ఆడమనిషిలా అవుపించింది. గుర్రాన్ని దౌడ తీయించి

---

**❊ ❊ డా॥ ఉప్పల లక్ష్మణరావుగారికి అభినందనలు ❊ ❊**

మన తెలుగు వాళ్ళలో తెలుగుజాతివారి ఆదర్శానికి, ఉద్యమానికీ, ప్రగతికీ, సాహిత్యానికీ, మేధావి తనానికి అగ్రగణ్యులెందరో మహామహులు ఉన్నారు, వారిలో డా॥ ఉప్పల లక్ష్మణరావుగారిని గురించి ఎంతో మందికి ఎంతో తెలుసును, విదేశ భాషల్లో తెలుగు వెలుగని ప్రసరింపజేసిన ఆదర్శనీయుడయిన ప్రజారచయిత, మేధావి శ్రీ లక్ష్మణరావుగారు మా జ్యోతి సంస్థకు చిరకాల స్నేహితులు, ఆప్తులు, ఆయన 85వ జన్మదినోత్సవ సందర్భంలో వారికి జ్యోతి ప్రత్యేక అభినందనలు తెలుపుతూ వారి రచనను ప్రచురిస్తున్నది—

అక్కడి కెళ్లా నిజంగానే — ఓస్త్రీ అక్కడ పడివుంది, కాని చిత్రమేమి టంటే — ఆ స్త్రీ వెల్లకిలా పడుంది. పావడ అంచుతో మొహంమీద ముసుకు కప్పుకున్నట్టుంది శకటం మెత్తాలమీద నుంచి దిగి, దగ్గర కెళ్లి చూశా — ప్రాణం వుం ' ఊపిరి ఆడు తూంది — పట్టాకత్తిమొన ఆమె పళ్ల వరసల మధ్యకి దూర్చి, దవడలు విడదీసి, నా నీళ్ల సీసాలోంచి నీళ్లు యిన్ని ఆమె నోట్లో పోశా దాంతో ఆ మనిషికి ప్రాణం లేచొచ్చింది. నా కంపెనీ వాళ్లందరూ యీలోపున అక్కడ చేరి ఆ మనిషిని ఆదే అడ గడం

"నువ్వెవరివి? ఇంత సిగ్గూలజ్జా లేకుండా నలుగురు కళ్ల ముందరా రోడ్డు పక్కనే యెందు కిలా పడు న్నావ్?" అని.

ఆడమనిషి ఘోరున శవరోదన మొదలు పెట్టింది. ఏమిటి జరిగిందో తెలుసు కుందుకు మాతాతలు దిగొ చ్చారు. ఆ త్రుహాన్ ప్రాంతంనుంచి వచ్చిన ఓ బందిపోటు ఒట్టుతనని కా కరించి వాళ్లబండిలో యెక్కించు కున్నారట. కానీ తీరా యీచోటకి వచ్చే సరికి ఆ ముష్కరులు తనని బలాత్క రించి, వాళ్లమామూలు ప్రకారంతనని రోడ్డు పక్కన్నపారేసి వాళ్లమానాన వాళ్లు పోయారట

నేను మా గూడెం వాళ్లతో అన్నాను.

"చూడండి, భాయ్, బందిపోట్ల చేతిలో యెంత బాధ పడిందో యీ ఆడకూతురు. అందుకని, మీరం దరూ ఒప్పుకుంటే యీమెని నా బండిలో ఎక్కించు కుంటాను.

దాంతో మా కంపెనీ వాళ్లంతా గొల్లుమన్నారు "ఒరేయ్, షిబలోక్, నీ బండిలో యక్కించుకుంటున్నావు, ఆమెని జాగ్రత్తగా చూసుకోరా; ఇలాంటి ఆడవది మాగట్టి ప్రాణంలే. కాస్త తెప్పరిల్లి బలం పుంజుకోనీయ్, అప్పుడా లోచించుదాం!"

ఎవరు చెప్పగలరు? ఆడంగులంటే ఆమడదూరం వుండే వాణ్ణి నేను. అటువంటిది ఆడమనిషి మీద నాలో కనికరం పుట్టు కొచ్చింది. దాంతో, లద్దినంకొని తెచ్చుకున్నట్టు, నానెత్తివి పాపం చుట్టుకుంది. ఆడకూతురికి మాతో కలిసి వుండడం చప్పున అల వాటై పోయింది. పీదిమాసిన లాల్చీలు ఉతికీయిస్త్రీ చేయనూ, వాడి చిరిగి పోయిన చౌదర్ పాయిజామా నేర్పుతో మాసిక వేసి కుట్టనూ - యిలా ఆక్రా స్పాక్ కంపెనీలో యిదివరకు మేం చేసుకుంటూండిన ఆడంగిపనులన్నీ తనునెత్తిన వేసుకుని చేస్తూండేది. ఐతే యేం...కంపెనీలో ఆడది వుండ డం కంపెనీకి గొప్ప అప్రతిష్ఠ అని మా కందరికీ అనిపించి పోయింది. కంపెనీ కమాండరు మమ్మల్ని నానా తిట్లూ తిట్టాడు.

"ఆ ముండని జుట్టుకిడ్చేసి కాకులకీ గెద్దలకీ పారేయండ్రా!"

నాకు మాత్రం ఆ ఆశ్చర్యం ... చూసి యింతా అంతాకాదు, మహా జాలేసి పోయింది, ఓనాడు ఆమెతో అన్నాను ...

"దార్యా, నామాట విను, యిక్కడ నుంచి నువ్వు మంచిగా వెళ్లిపోడమే నయం. యే పిచ్చి తుపాకీ గుండో యీలవేసి విన్నెగరేసి పోయేకంటే. ఆ తరువాత మరి యేడుపులూ మొత్తుకోళ్లూనూ, ఎందుకొచ్చింది?" ....

ఆమె కంట్లో నీళ్లు తిరిగాయి-వల వల యేడుస్తూ అంది.

"మీరు మంచి కొసాక్కులు గనక, నన్నిక్కడే గుండేసి కాల్చేయండి. నేను మాత్రం మిమ్మల్ని విడిచిపెట్టలేను ....లేదు"

మరి రెండు మూడు రోజులకే నా మెషీన్ గన్ను శకటు సారథి యిద్దలో నేలకొరిగేసరికి ఆమె నా నోట్లో కరక్కాయ కొట్టింది.

"నీ బండి వాడిపని నాకియ్యకూడదూ? గుర్రాల్ని చూసుకునే విషయంలో కదమ వాళ్లెవ్వరికీ యే విధంగానూ నేను తీసిపోను" అంది.

ఆమెకి కళ్లెం అందిచ్చాను.

"మరి నువ్వుకాని, లడాయి జరుగుతున్నపుడు మెషీన్ గన్ను బండిని సమయం కనిపెట్టి క్షణంలో యెక్కి మళ్లించలేక పోయావంటే మాత్రం, నిన్ను అక్కడి కక్కడికే రోడ్డుమీదికి తోసేసి, కొరడాతో చచ్చేలా బాదుతాను" అన్నాను.

బండి యెలా తోలాలో ఆమె క్షుణ్ణంగా యెరుగుననే చెప్పాలి. ఆ విషయంలో ముసలి కొసాక్కులకికూడా ఆమె పాఠం చెప్పగలదు. అందుకేమీ సందేహం లేదు. ఆడదై పుట్టినప్పటికీ గుర్రాల విషయంలో అసలైన ఏ కొసాక్కుకి ఆమె యే మాత్రమూ తీసిపోదన్న మాట. యిద్దం జరుగుతున్నప్పుడు బండిని ఆమె చటుక్కువి యెలా మళ్ళించేదంటే గుర్రాలు వెనకాళ్లు రెండింటినీ పైకెత్తేసేవి. రోజులు గడచినకొద్దీ కథ కూడా ముదిరింది. ఆమెతో నాకు సంపర్కం యేర్పడింది. ఇలాంటి పరిస్థితుల్లో యెలా జరుగుతుందో అలా జరిగింది-ఆ మనిషికి కడుపైంది. ఆడాళ్లకి యెన్ని కష్టాలు తెచ్చిపెడతాం, మొగాళ్లం. బందిపోటు జట్లని తరుముతూనే ఎనిమిది నెలలు గడిచి పోయాయి. మా కంపెనీలో వున్న కొసాక్కులు నకిలింపులు మొదలెట్టారు.

"ఒరేయ్, షిబలోక్, నీ బండి మనిషికేసి చూడ్రా! గవర్నమెంటు అర్పుమీద భోజనం ఆ మనిషికెంత బాగా పడిందో, బొద్దుగా, గుండ్రంగా, బండి మెత్తాలమీద ఇహ జాగా వుండదురోయ్."

ఓనాడు లడాయిలో మేం ముందు శ్రేణిలో వున్నాం- మా మందు గుండు సామాను పూర్తిగా నిండుకుంది. తెప్పించుకుందామంటే బళ్లులేవు. గూడానికి ఆ




చివర బందిపోట్ల దళం వుంది. యీ చివర మేం వున్నాం. మా దగ్గర మందు గుండు అయిపోయిందన్న సంగతి గూడెంలో వాళ్లెవ్వరికీ తెలీకుండా అతి రహస్యంగా వుంచాం. సరిగ్గా అప్పుడు జరిగింది నమ్మక ద్రోహం. అర్ధరాత్రి అయింది. నేను గస్తీ మీదున్నాను. తుపాకులు వినబడ్డాయి. భూమి మూల్గింది. దద్దరిల్లింది. గజ గజ వణికింది. అగ్ని పర్వతంలోంచి పొరలొస్తూన్న లావా ప్రవాహంలా, గూడెం లోనుంచీ, చుట్టుపక్కల నుంచీ వచ్చేస్తున్నారు బందిపోట్లు. మమల్ని చక్రబంధంలో యిరికించడానికి మా మీద దాడి ప్రారంభించారు. ఏ విధమైన ప్రమాదమూ వుండదని వాళ్లకి నిశ్చయంగా తెలిసి [illegible] యెక్కడలేని పెంకితనంతోనూ అరవడం మొదలు పెట్టారు.

"ఏయ్, ఎర్ర కొసాక్కులూ, లొంగిపోండి. మీ దగ్గరున్న తూటాలన్నీ అయిపోయాయి, ఉత్తపుణ్యానికే యెందుకు నెత్తురు కక్కుకుంటారు, బాయ్."

నిజంగానే మేం నెత్తురు కక్కుకున్నాం. మమ్మల్ని వెంట తరిమి ఎలా దౌడు తీయించారంటే.. ప్ర మోపెడూ ఒక పందెపు పరుగైంది ఎవడి గుర్రం త్వరగా పరుగెడుతుందా అని. తెల్లవారే లోపుగా మేం గూడెంనుంచి ఎంత లేదన్నా పదిహేను వెర్స్తులు స్వారీచేసి అందరం ఓ చిట్టడవిలో పోగై లెక్క చూసుకునే సరికి మాలో సగం మందిమే బతుకు జీవుడా అని ప్రాణాలతో అక్కడ చేరుకున్నామని తేలింది.—పారిపోగా మిగిలిన యే కొద్దిమందో తప్ప కదం వాళ్లందరూ కత్తివేటుకి బలి అయి పోయారు. నా

ప్రాణం మహా చావుకొచ్చింది వెధవ బతుకు యెందుకని పించింది. ఇదివాల నట్టు దార్య బాధతో చుట్టుకు పోతోంది రాత్రంతా గుర్రాన్ని దౌడు తీయిస్తూనే వుందేమో మనిషి రూపే మారిపోయింది. మొహం నల్లబడి పోయింది నాసు బోధపడి పోయింది—మరొక్క నిమిషంలో మేం ఉన్న చోటు నుండి వెళ్ళిపోయి. మాకు కనబడకుండా వుండేందుకని అట్టడవిలోకి వెళ్ళి దాగుంటుందని, ఇలా జరుగుతుందని నేను అప్పుడే అనుకున్నాను. అనుకుని ఆమె వెంట వెళ్ళాను. గాలి తగలకుండా వుండడానికని ఓ లోయలో ఓ గొయ్యి చూసుకొని, కిందపడిపోయిన ఆకుల్ని యేరుకొచ్చి ఆడతోడెలు ఆ గోతి లోకి వెళ్ళిపోయి తొలుత బోర్ల పడుకుంది కాని మరి కాస్సేపటికి దొర్లి వెల్లకిలా పడుకుని వొగర్చుకుంది నొప్పులు మొదలయ్యాయి. ఓ పొద చాటున నక్కిపోయి మోకాళ్ళ మీద కూచుని చెట్ల రెమ్మల సందులోంచి చూశాను... మూలుగుతూంది కాస్సేపటికల్లా అరుపులూ కేకలూ మొదలు పెట్టింది, కళ్ళనీళ్లు బుగ్గలంట కారుతున్నాయి చర్మం అంతా పసుపు పచ్చగా మెరుస్తూంది. కళ్లు ఉబ్బిపోయాయి. మనిషి ఆయాసపడిపోయి ఒళ్ళు చుట్టలు చుట్టకు పోతూంది. కాసాన్సకు కంట పడాల్సిన దృశ్యం కాదనే...కాని అలా కళ్ళప్పగించేసి ఆమెకేసి చూస్తూనేవున్నా తటాలున నాకు తోచింది...ఈ మనిషి సిగ్గుత లేకుండా వుంది. చచ్చిపోతుందని.... పొదల చాటునుండి చెంగున పురికి ఆమె దగ్గరికి పరుగెత్తాను. నేనే ఆమెకి సాయం చెయ్యక తప్పదన్న సంగతి అర్థమయి పోయింది నాకు కోటు చేతులు దండల వరకూ మడిచేసుకున్నారు. ఆమె మీదకి వంగాను, నా కెంత భయం వేసి పోయిందంటే... ముచ్చెమటలు పోసిపోయి వొళ్ళంతా తడిముద్ద అయిపోయింది. మనుషుల నిండు ప్రాణాలు తీసెయ్యడానికి నేనే నాడూ వెనుకాడలేదు. అటువంటిది యిక్కడ నాకు కాళ్ళూ చేతులూ ఆడ లేదు! ఆమె దగ్గరికి వెళ్లగానే ఆమె అరుపులూ కేకలూ మానేసి ఉద్రేక పడిపోయి పిచ్చి వాగుడు మొదలు పెట్టింది.

"యూష! మంచగుండు అయిపోయిన సంగతి బందిపోటు ఇట్టికి యెవరు చెప్పారో తెలుసా?" అంది అలా అని నా వేపు గంభీరంగా చూసింది.

"ఎవరు?" అని అడిగాను

"నేను" అంది.

"పిచ్చిదానా! యేమిటా మతిపోయిన మాట? కుక్క వెర్రి పట్టిందా యేమిటి నీకు? నోరుమూసుకు పడుకో" మళ్ళీ ఆరంభించింది.

"యముడు నా యెదుట నించుని పిలుస్తున్నాడు నన్ను: నేను చేసిన నేరం

పీ యెదుట ఒప్పేసు కుంటున్నాను. యూష, ఎలాంటి విషసర్పాన్ని పాలు పోసి పెంచావో నువ్వు ఊహించు కోనేనా ఊహించుకోలేవు"

"విన్ను వేధించుతూన్న నేరం యేమిటో యేడుద్దూ" అన్నాను అదేదో చెప్పేసి ఆ బరువు దించేసుకుంది చెబుతూ తలకాయని నేలకేసి కొట్టు కుంది.

"నా అంతట నేనే ఒందిపోట్ల జట్టుతో చేరా" అంటూ చెప్పడం మొదలెట్టింది " జట్టునాయకుడు ఇగ్నా శియల్ వెంటపడ్డాను....ఓ యేడు గడ చాక మీ కంపెనీలో చేరి మీ కంపెనీ గురించి యావత్తు భోగట్టా తెలుసుకుని రిపోర్టు చేయవలసిందని నన్ను పంపిం చాడు. నన్ను బలాత్కరించినట్టు మీ దగ్గర ఓ నాటకం ఆడాను. నాకు చావు దగ్గరకొచ్చింది. లేకుంటె నీ అందరిని ముందు ముందునాశనంచేసి వుందును"

నా గుండెల్లో కుతకుత మరిగినట్టని పించింది. ఇక నేను భరించలేక పోయాను....బూటు కాళ్ళతో ఆమెని పది తాపులు తన్నాను. నోటంటు నెత్తురు కారేవరకు..ఆమె మొహం మొత్తేశాను ఆమెకి మళ్ళీ నొప్పులు మొదలెట్టాయి. నాకు తటాలున కదలిందింది ...ఆమె తొడల మధ్య చంటి పసిగుడ్డు బయటపడ్డం, వొళ్ళుచెమ్మగా వుంది. నక్కనోట పడిన కుందేలు పిల్లలా కెవ్వుమని కేక పెట్టింది. దార్యమాత్రం యేడుస్తోంది. నవ్వు తూంది. నా పాదాలమీదపడి నాకాళ్ళ రెండూ కౌగలించుకోబోయింది. నేను గిర్రున తిరిగిపోయి మా కంపెనీని చేరుకున్నాను. చేరుకొని తోడి కొప్పా కులతో జరిగినదంతా పూసగుచ్చి నట్టు చెప్పాను.

ఉగ్రులైపోయారు ఆ కోపంతో నన్ను ముక్క ముక్కల కింద నరికి పారెయ్యాలనుకున్నారు. కాస్సేపయాక నాతో అన్నారు.

"ఒరేయ్ షీబలోక్ నువ్వు ఆ పాని

---

✱ "ఇదిగో! ఈ కుక్కను కొనండి సార్! ఇది చక్కగా మాట్లాగలదు!" అన్నాడు కుక్కల షాపతను.
రంగారావ్ ఆశ్చర్యపోయాడు. "ఏమిటి? ఈ కుక్క మాట్లాడుతుందా?"
ఆ మాట వింటూనే కుక్క కల్పించుకుంది!
"అవున్సార్ నేను మాట్లాడగలను!"
రంగారావ్ మరింత ఆశ్చర్యపోయాడు. "అదేంటోయ్! ఇంత అద్భుతమైన కుక్కను ఎందుకు అమ్మాలనుకుంటున్నావ్?"
"ఎందుకేమిటి సార్! నాకు అబద్ధాలు వినడమంటే పరమఅసహ్యం!"




షిని కిరాయికి పెట్టుకున్నావు, కాబట్టి రాయిడబ్బులిచ్చి దానిని, యిప్పుడు పుట్టినదాన్ని సంతానాన్ని కూడా యీ లోకంనుంచి పంపించేయాలి. నువ్వు అలా చేయకపోయావంటే కాబేజీని కైమా చేసేసినట్లు నిన్ను కైమా చేస్తాం."

కొందరి కాళ్ళమీదా పడి చెప్పుకున్నాను

బాస్, నేనే చంపేస్తాదాన్ని. ఐతే మీకు భయపడికాదు, నా అంతరాత్మని అనుసరించే దాని నమ్మకద్రోహంగా యెంతమంది మన అన్నదమ్ములూ కామ్రేడ్లతంలో యెగిరిపోయినందుకు శిక్షగానే. కాని ఆ పసిగుడ్డుని మాత్రం కాసింత మీ కడుపులో పెట్టుకోండి ...ఆ నలుసులో పంగోతు వంతుకి నేను బాధ్యుణ్ణి, నాకు నా సంతతి, నాణ్ణి బతికి బట్టకట్టనీయండి. మీకు పెళ్ళాం పిల్లలూ వున్నారు. నాకు తప్ప నా అన్నవాడు నాకెవ్వరూ లేదు."

కంపెనీ వాళ్ళని కాళ్లావేళ్లాబతిమాలుకున్నాను. మన్ను ముద్దు పెట్టుకున్నాను. అప్పుడు వాళ్ళకి నామీద కనికరం పుట్టి అన్నారు.

"సరే అలాగేకానీయ్! నీ సంతతి వాడు బతికి బాగుపడనీ వాడు కూడా నీ అంతటి సాహసికుడైన మెషిన్ గన్నరు కానీయ్, షిబలోక్ కాని ఆ ఆడదాన్ని మాత్రం సుళ్ళేహజాపుకు చేసేయ్యాలి."

దార్య దగ్గర కెళ్ళాను. ఆమె కాస్త తెప్పరిల్లి పసివాణ్ణి చేతుల్లో పెట్టుకుని కూచుంది.

ఆమెతో అన్నాను.

"ఇదిగో. వాడికి నువ్వు చన్నిచ్చి పాలు కుడిపావంటే నేను వొప్పుకోను. గడ్డు రోజుల్లో పుట్టిన పసికందుని తల్లి పాలు తాగనీయకూడదు. కాని, దార్య నిన్ను నేను చంపేయక తప్పదు,-- ఏమంటే నువ్వు మా సోవియట్ ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తున్నావు. ఆ లోయ అంచున నాకేసి చూస్తూ నుంచో.-"

"యూష, మరి ఆపసిగుడ్డు యేంగాను? నీ బీము నెత్తురు లోంచి పుట్టిన వాడు- నీ కన్నకొడుకు-నన్నుచంపేశావంటే, తల్లిపాలు లేక వాడు చచ్చిపోతాడు. వాడు తలిపాలు తాగినన్నాళ్లూ నన్ను బతకనీయ్ ఆతరవాత నన్ను చంపేయ్- నే వొప్పుకుంటాను -" అంది దార్య.

వీల్లేదు అన్నాను నేను. "నా కంపెనీ కఠినంగా ఆజ్ఞాపించింది నన్ను. నిన్ను ఒక్క క్షణమైనా బతక నివ్వ కూడదన్నారు పిల్లాడిగురించి నువ్వేమి బెంగ పెట్టుకో నక్కరలేదు. గుర్రం పాలు కుడిపించి వీణ్ణి పెంచుతాను. వీణ్ణి చచ్చిపోనియ్యను "

రెండడుగులు వెనక్కేశాను. బుజం మీదనుంచి తుపాకి దించాను ఆమె నాకాళ్లు పట్టుకొని నాబూట్లని ముద్దెట్టుకుంది.

ఆ తరువాత మరి వెనక్కి తిరిగి చూడకుండా, పిల్లాడున్న చోటుకి పరిగెత్తాను. చేతులు గజ గజ వణికాయి. మోకాళ్లు వొంగిపోయాయి వొళ్లుజారు జారుగా నగ్నంగా వున్న ఆపసికందుని యెత్తుకోలేక పోయాను.

ఓ ఐదురోజులయాకా మేం మళ్లీ వెనక్కి మళ్ళినప్పుడు ఆచోటుమీదక్కనుంచీ వెళ్ళాం లోయలో అడవిపై నల్లమబ్బులు కాకులు ఏగురుతున్నాయి ఈ నలుసు గాడితో నేను పడిన పాట్లు అన్నీ ఇన్నీకావు

"ఇదిగో షిబలోక్, వీణ్ణి ఎలాగో వదిలించుకో. ఎందుకు నీకీ సంకెళ్లు? ఎంతకని చస్తావు వీడితో?" అంటూండే వాళ్లు కొసాక్కులు.

కాని యీ నలుసు వెధవని చూసి నాకు మహా దిగులేసు కొచ్చేది-భరించ శక్యం కాదనిపించి పోయింది, నేను అనుకునేవాణ్ణి వీడు బతికి బట్టకట్టాలి, తండ్రి అప్పటికి చచ్చి మట్టి అయి పోయాడు. కొడుకు సోవియట్ ప్రభుత్వాన్ని కాపాడుతాడు. యాకోవ్ షిబలోక్ ప్రజల స్మృతి పథంలో నిలబడతాడు. అంతే కాని, కలుపు మొక్కలా చావడు, వాడి సంతతి చిరస్థాయిగా వుండి పోతుంది. ఇదిగో మేజరమ్మాయ్, నువ్వు చాలా మంచి దానివి నేచెబుతున్నా. నామాట నమ్ము. నా బతుకంతటిలోనూ తొలిసారి కంట నీళ్లు నింపుకున్నది వీడి కోసమే. మా కంపెనీ గుర్రాల్లో ఓ ఆడ గుర్రం యీనింది. దానిపాలు వీడు తాగుతాడని దానిపిల్లని గుండేసి కాల్చేశాం. పాలతిత్తి ఒకంతట నోట్లోపెట్టుకునేవాడు కాడు. అదే యేడుపు ఏడ్చేవాడు.

తరువాత క్రమంగా అలవాటైంది. పాలతిత్తి తల్లి రొమ్ముకీ ల్చుకు తాగే కదమ పిల్లలకంటె పాలపీక పీల్చుకుని పీడే బాగా పాలు తాగేవాడు.

నాషరాయి చింపేసి నేనే కుట్టాను పీడికి జుబ్బా- అది పొట్టై పోయింది పీడికి- పెద్దాడైపోయాడు మరి ఐతే యేం, ఇహ ఫరవాలేదు ఇప్పటికి. తరువాత చూసుకోవచ్చు

ఇహ అంతా విన్నావు కదా, నువ్వే ఆలోచించి చెప్పు పీణ్ణి తీసుకుని యెక్కడికి పొమ్మంటావ్ నన్ను? ఇంత చంటిపిల్లని మేం తీసుకోం అంటావా? మంచి తెలివైన వాడు సుమీ, వాడితిండి వాడే అడిగితింటాడు. ఒకరు తినిపించక్కర్లేదు. పీణ్ణితీసు కుంటావా? నిజంగానే? ధన్యవాదాలు అమ్మాయి! షామిన్ నాయకత్వాన తిరుగుతూన్న ఆ బందిపోటు ముఠాని, తుడిచి పెట్టేయడం అయిపోయాక, నాల్గురోజులు తిరక్కముందే రెక్కలు కట్టుకు వాల్తానిక్కడ-పీణ్ణి చూడ్డానికి.

ఒరేయ్, నాన్నా, షిట్‌లోక్ సంతతి వాడా! నే వెళ్లొస్తాను, మరి! చప్పున పెరిగి పెద్దాడి వై పో! ఓరి భడవా? ఇప్పుడు నాన్న గెడ్డం పీకుతావట్రా! నానా పాట్లుపడి నిన్ను పెంచలేదట్రా నేను ఎన్నో బాధలు భరించి నిన్ను సాకలేదట్రా? చివరికి నాన్న గెడ్డం పీకి నాన్నతో పోట్లాట పెట్టుకుంటావా? ఇదిగో వెళ్ళిపోయే ముందర ఒక్కసారి నిన్ను ముద్దు పెట్టుకోనీయ్.

మేజరమ్మాయ్! పీడిని గురించి నువ్వేమీ గాభరా పడకు. పీడు యేడు స్తే ఏం చెయ్యడం అంటావా? అబ్బే! పీడు అసలు యేడవనే యేడవడు! పీడి తండ్రి బోల్షెవిక్, పీడికి తాడ్డో గాపొచ్చే బోల్షెవిక్ గుణాలు అబ్బాయనుకో! పీడు యేడవడు. కాని కరుస్తాడు. ఆమాట దాచటం యెందుకు- నువ్వు యేంచేసినా సరే- నువ్వు మాత్రం వాడి కళ్ళంట నీళ్లు తెప్పించలేవు.

## ఓ రైలు కంపార్టుమెంటులో

"అమ్మా! ఇప్పుడు మనం దాటి రైలుస్టేషను పేరేమిటి?" అనడిగాడు చిన్నిగాడు

"నోర్మూసుకో నీ కెందుకు?" ఆ దావిడ నవల చదువుతూ

కాసేపాగి మళ్ళీ "అమ్మా! మనం దాటిన ఆఖరి స్టేషన్ పేరేమిటి?" అని అడిగాడు వాడు

వాళ్ళమ్మకు చిరాకు పుట్టుకొచ్చి వాడినెత్తిన మొట్టికాయవేసి "అలా ఊరికె వాగద్దన్నానా? ఏస్టేషనయితే నీకెందుకు?" అంటూ కసురు కుంది

"ఏ స్టేషనో తెలిందే తమ్ముడు అక్కడ రైలాగినప్పుడు దిగిపోయాడు అని ఎలా చెప్పాలేం?" కోపంగా అడిగాడు చిన్నిగాడు.

# కల్లోల గౌతమి

## లల్లాదేవి

"అక్కా తిరిగి వెళ్ళిపోదాం, ఇక్కడ దక్షిణాది వారిని దోచుకోవటం జరుగుతోంది. మనం కొనుగోలు చేయవలసిన దేమి లేదు కాబట్టి తిరిగి వెళ్ళిపోటమే మంచిది" అన్నది ఐరావతి. మహా దేవుడు కూడ ఆమె మాటలను సమర్థించాడు

"తిరిగి పోవటమే మంచిది" అన్నాడు. తిరిగి పోవటం గురించి చర్చ జరుగుతూ ఉండగా ఒకవ్యక్తి హఠాత్తుగా అక్కడకు వచ్చాడు, తుల్యభాగను ఉద్దేశించి "శమంతుడు నిన్ను రమ్మంటున్నారు" అన్నాడు. ఐరావతి ప్రాణువు.. అయిపోయింది. "అక్కా! నేను చెప్తే విన్నారా? అనుకున్నదంతా అయింది. ఇప్పుడేమి చెయ్యాలి" అన్నదామె

"నేను వెళ్ళి శమంతునితో మాట్లాడివస్తాను" అన్నది తుల్యభాగ, ఆమె కంఠస్వరంలో రవంత అయినా జంకు గొంకులు లేకపోవటంతో సహచరులంతా భయపడిపోయినారు

"అక్కడేమి జరుగుతుందో?" అన్నది ఐరావతి అనుమానంగా, ఆ మాటలకు నిర్లక్ష్యంగా నవ్వింది తుల్యభాగ.

"చెల్లీ! ఎందుకమ్మా ఈ అదురుపాటు? కృష్ణాసంబంధాలతో బ్రతుకునిలుపుకున్న ఈ యక్షగణపతుల ఆత్మగౌరవాన్ని కించెపరచిననాడు అతడు శమంతుడే కాదు శచీంద్రుడయినా మట్టికరుస్తాడు. నీవు నా గురించి ఎందుకు బెంగపెట్టుకుంటావు" అన్నదామె.

★ ——— జరిగిన కథ ——— ★

(ఔత్తరాహుడయిన శమంతుడు దక్షిణాపథసంపదలని ఆర్యప్రభువులకి అమ్ముకొనే ప్రయత్నాన్ని తండ్రి వివరించినా ధైర్యంచేసి చెలికత్తెలతో తుల్యభాగ బిడారుని చేరింది ...... పెద్దపెద్ద దేహాలతో, వస్త్రాలంకరణలతో బిడారు దక్షిణాదివారిని ఆకర్షిస్తోంది—ఆర్యయువకులు సాధారణ ఆయుధాలని, ఇతర వస్తుసంచయాన్ని విక్రయిస్తూ ఆర్యఘనతని చెబుతుంటే తుల్యభాగ వారికి సరిసమానంగా జవాబు చెబుతూ ముందుకి సాగింది ...)

"ఒంటరిగా నువ్వెందుకు పోవాలి. నీ వెంటనే రాకూడదా ?" అన్నాడు మహాదేవుడు. ఒంటరిగా పోతే శమంతుడు ఆమెకేదయినా కీడుతలపెట్టి వచ్చు నన్నభయం ఆతని మాటలలోనూ, కంఠ స్వరంలో ధ్వనిస్తోంది.

తుల్యభాగ అందుకు అంగీకరించలేదు,

"శమంతుని గురించి మన కేదయినా తెలియాలి అంటే నేనుఒంటరిగానే పోవాలి. ఇంక నన్ను నేను కాపాడుకునే సంగతి అంటావా? నన్ను నీవెరుగవా మహాదేవా?" అన్నదామె

మహాదేవుడికి ద్వంద్వయుద్ధంలో ఆమెనించిఎదురయిన అనుభవం మరొక మారు జ్ఞాపకం వచ్చింది. శారీరకమయిన శక్తి సంపన్నతలోనే కాదు సమ యోచితంగా ప్రత్యర్థి ఎత్తులను చిత్తు చేయటంలో కూడ ఆమె యశంగణంలో ప్రథమురాలు.

ఆతనికి రవంత ధైర్యం కలిగింది,

నీ వెంట రాకపోయినా నిన్ను అనుసరించి గమనించేందుకూ, అవసర మనిపించినప్పుడు బయట పడేందుకూ అంగీకరించు నీవు తిరిగి వచ్చేవరకూ మేము చేయవలసిన పనులు వేరేమున్నాయి?"అన్నాడతడు అందుకు సరేనంటూ తల ఊగించి వార్త తెచ్చిన వ్యక్తి వెంట బయలుదేరింది తుల్యభాగ

మైదానందాటి వర్తులవలయాకృతిగా ఉన్నడేరాలున్నాయి. వాటి మధ్య రవి కిరణాలు సోకి తళతళలాడే జిలుగు వస్త్రాలతో నిర్మించిన డేరా కన్పించింది.

చూస్తూనే అది శమంతుని కోసం నిర్మించినదని గ్రహించిందామె నాగరి కత పేరులో వర్ధిల్లుతున్న ఈ ఆడంబరజీవనంలో ధనవంతుడు అందరికీనాయ కుడవుతాడు ధనహీనులంతా అతను పడిపంచలచేరి, అతనిలో లేని సుగుణాల గురించి కీర్తిస్తూ, అతని కోపానికి తిట్లకూ, తన్నులకూ గురి అవుతూ, ఆతని దయాబుద్ధివల్ల సంప్రాప్తమయి అల్పమయిన ఆదాయంతో పొట్టనింపుకుంటూ ఊడిగం చేస్తారు మిగిలినవారు.

అతనికి తమ సోదరీమణులను, తనుభవలను కానుకలుగా చెల్లించుకని దయాపాత్రులవుతారు

అందరికన్నా అతడే ఉన్నతుడని దైవాంశసంభూతుడని మ్రొక్కులు మ్రొక్కుతారు. నటజంగముడయిన మహాదేవుని దృష్టిలో మానవ ప్రాణులంతా సహానవలేని ఆలోచించలేరు వారు

వారిని ఏలుతున్నవారు అలా ఆలోచించే అవకాశం వారికి కల్పించరు· అది రాచరికాలలో సర్వసాధారణం

అంగనించి ఆడేరా తప్పక శమంతునిదే అయివుంటుందని ఊహించింది

తుల్యభాగ ఆమె ఆలోచనలు యథార్థమే అన్నట్లుగా వార్త తెచ్చిన వ్యక్తి ఆమెను తీసుకు వెళ్ళి ఆదేరా ముందు నిలిపాడు. అక్కడ పిల్లి కళ్ళ గోధుమ వర్ణ శరీరం కలిగిన ఒక వ్యక్తి కావున్నాడు. ఆమెను అతనికి అప్పగించి తిరిగి వెళ్ళిపోయినాడతడు. కాపుగా ఉన్న వ్యక్తి అమితబలశాలి.

అతని గోధుమ వర్ణ శరీరం సుదీర్ఘమయినది. తలచిన్నదిగా కన్పిస్తున్నా ఛాతి సువిశాలమయినది. బాహువుల కండలు తిరిగిపోయి ఓగున్న ఏనుగును అవలీలగా పైకెత్తగలడనిపించింది. అతన్ని చూస్తే హిమసానువులకు ఆవలివ్యక్తిలా కన్పించలేదు. తుల్యభాగను నఖశిఖ పర్యంతం పరీక్షించాడు.

"అమ్మాయీ! నా ఏలిక అయిన శ్రీమంతుని దగ్గర నీవు వినయవిధేయతలతో మసలుకోవాలి. ఒద్దికగా మాట్లాడి అడిగినంతవరకే సమాధానం చెప్పాలి. గొప్పవారితో అధికం మాట్లాడకూడదు. ఇందుకేమయినా భిన్నంగా జరిగితే నీ ప్రాణాలు తీయవలసిన అవసరం ఏర్పడుతుంది. అటువంటి సమయం ఆసన్నమయితే ఆపని చేసేందుకు నేను అరక్షణమయినా ఆలోచించను. తెలిసిందా?" అన్నాడతడు ప్రభుభక్తిని ప్రదర్శిస్తూ.

తుల్యభాగ అతని మాటలు విని నవ్వింది.

"సోదరుడా! నిన్ను చూస్తే మహాబలశాలిలా ఉన్నావు నీవు వ్యవసాయం చేయదలిస్తే మట్టిగడ్డలు తిని పెంచుకోవలసిన అవసరమేలేదు.

నీ బలంతో నీవుగా అనుచరులతో భూమిని పోషించగలవు. ఇంతటి రాక్షసుడైన శక్తివంతుడవని కనిపిస్తున్నావు. నీకు ఈ దాసవృత్తి ఎందుకు? అన్నట్లు నదులూ చెరువులూ తెలుసుగా.

అతడు నివ్వెరపోయినాడు.

శమంతుని కొలువులో తాను చేరి దశాబ్దం పైగా అయిపోయింది. ఇంత, కాలంలోనూ తనను అలా ప్రశ్నించిన వారెవరూ మచ్చుకయినా కనిపించలేదు

"ఎవరయినాసరే తన ఎదుట పడినాక, గుండెలు అవిసిపోయేలాగ వెర్రిచూపులు చూచినవారే. తనేదయినా చెప్పినప్పుడు ఇష్టం ఉన్నా లేకపోయినా అందరూ తల ఊగించినవారే! ఒక ఆడపిల్ల అలా ధిక్కరించి మాటాడటం అతని బలవంతపన్నతకు తలవంపు అనిపించింది. ఒక వేళ నా శరీరంలోని శక్తి యావత్తు ఆవిరి అయిందా అన్నట్లు తన కండరాలవంక శిరా శకలాల మీద చర్మం కప్పినట్లున్న పిక్కలవంక చూచుకున్నాడు కంఠరాలను తిప్పించి చూచు కున్నాడు.

"నేను శక్తిశాలినని నీవు అన్నందుకు నాకు ఆనందమే కాని, రాక్షస యువతీ వ్యవసాయం చేయవలసిన అగత్యం నాకేమిటి? నేను శమంతుని అంగ రక్షకుడను

అతని అంగరక్షకుడుగా పనిచేసినందుకు నాకతడు ఎంత మూల్యం చెల్లిస్తాడో తెలియక నీవు అలా అంటున్నావు" అన్నాడతడు. కింకంగా తుల్యభాగ ఆ మాటలకు పకాలున నవ్వింది,

ఆమె దరహాసపు వెలుగు తంగేడు పూలనించి జారుతున్న తుషార బిందు వుల వలె తరళించింది.

"సోదరుడా! మనిషి ఉన్నతుడయేందుకు పనికి వచ్చేదిగా వృత్తితో అర్జించిన ధనరాసి కాదయ్యా; స్వేచ్ఛా ప్రవృత్తిలో సాధించుకొన్న పట్టెడు మెతుకులయినా తృప్తి నిస్తాయి. పదుగురిలో గౌరవాన్ని పెంచుతాయి.

నీవు ఎంత ధనాన్ని ఆర్జించినా బానిసవే కదా! కాదనగలవా? అదిసరే! ఈ శమంతునితోపాటు దేశాలు తిరుగుతున్న వాడవు. ధనాన్ని ఏమి చేసు కుంటావు? భార్యాబిడ్డలకు పంపుకుంటావా?" అని అడిగింది తుల్యభాగ.

ఆ మాట వింటూనే అంగరక్షకుడయిన అమాహా బలశాలి ముఖం వివర్ణ మయింది. కనులు శూన్యమయినాయి.

"భార్యాబిడ్డలా" అన్నాడతడు పలవరించుతున్నట్లు

"అవును నీ కెవరూ లేరా, ఎందుకలా దిల్లపడిపోయినావు" అని అడిగింది తుల్యభాగ. ఆమె కంఠస్వరంలో అతని దురదృష్టం పట్ల సహానుభూతి ధ్వనించింది.

ఆమె మాట వెనుక తరలి వస్తున్న కరుణ సింధువుల తరంగాలను చూచాడతడు. అర్ధ్రితకు విచలితుడయినాడు.

"నీవు అధికంగా మాట్లాడుతున్నావు" అన్నాడు మనోగతాలన్నింటిని బలవంతంగా అణచుకుంటూ,

అతని ఆంతర్యంలోని బలహీనత తాలూకు స్పందనలను చవిచింది తుల్యభాగ, పైకి అతడెంతగా నటించినా మనసులో పొడచూపిన దౌర్బల్యాలను అర్థం చేసుకుంది.

"సోదరుడా! నీ యోగక్షేమాలను గురించి తెలుసుకోవాలనుకోవటం అధిక ప్రసంగమవుతుందా? అంతేనని నీవు మనఃపూర్వకంగా అనగలిగితే మరింక మాట్లాడను" అన్నదామె

ఆమె మాటలు వింటున్న అతని కనులు చెమరించినాయి.

"నేనెవరని నీవు నాకేమవుతావని నన్నిలా అడుగుతున్నావు"

అన్నాడతడు హీనమయిపోతున్న స్వరంతో

"సోదరా ప్రేమించే మనసున్న వారికి ప్రపంచమంతా బంధువులే కదా," అన్నది తుల్యభాగ.

ఆ మాటతో అతనిలో మిగిలి ఉన్న పట్టు దిగజారిపోయింది తన కర్తవ్యంను గురించి అయితే అతడు కఠినుడు.

తన గురించి ఆలోచిస్తే అతడు దీనుడు తన గురించి జ్ఞాపకం రాగానే అతని కనులు చెమరించినాయి. కర్తవ్యాలమాటున అణగారి పోయిన బాధామయమయిన జ్ఞాపకాలు అతని చుట్టుముట్టినాయి. తనకు తాను కల్పించుకున్న కర్తవ్యమనే ముసుగుమాటున దాగిన యథార్థం ఆత్మీయతాస్పర్శతో బయటపడింది

"అమ్మా! నీవెవరో కాని నా ఆంతరికమయిన హద్దులను స్పృశించినావు సోదరా! అని సంబోధించి కనుమనాడో మరచిపోయిన మధురస్పందనలను ప్రేరేపించినావు.

ధన్యవాదాలు సోదరీ! ఈదీనుడికదవిని నీవు చేయగలిగినది ఏమీలేదు యథార్థమే. నేను బానిసను.

శారీరకంగానే కాదు మానసికంగా కూడ బానిసను నా బ్రతుకునిష్ఫలమయిందని తెలిసాక ఎన్నడయినా అంతరాత్మ ఎదురు తిరుగుతుందన్న

# మనం - మన భవిష్యత్తు

భవిష్యత్తును తెలుసు కోవటానికి మానవులకుండే ఆసక్తిని చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంది, ప్రాచీన కాలంలో ప్రఖ్యాతి గాంచిన రోమ్ దేశస్థులు కూడా ఇటువంటి నమ్మకం కలిగి వుండేవారు. పంజరంలో ఒక కోడి పెట్టను వుంచి, దాని ముందు ధాన్యం చల్లేవారు. ఆ ధాన్యంగింజల్ని ఆ కోడి పెట్ట గబగబా ఆరగిస్తే అది మంచి శకునం. అలా కాకుండా తినటంలో అది అశ్రద్ధ చూపితే అది అపశకునంగా విశ్వసించేవారు. కొన్నిసార్లు

భవిష్యత్తులో మనకు అదృష్టం అబ్బుతుందంటే ఆనందించటం, దుర దృష్టం ఎదురౌతుందంటే ఏడవటం మన కలవాటే భవిష్యత్తు గురించి తల బద్దలు కొట్టుకోకుండా, భవిష్యత్తు అదుపులో పెట్ట కలిగిన భగవంతుని ఆశ్రయిస్తే ఎంతమేలు. అది అదృష్టమో. దురదృష్టమో దాని చింత మనకెందుకు ?

దేవుని ప్రేమించువారి కోసం, అంటే ఆయన సంకల్పం చొప్పున పిలువబడిన వారి కోసం, మేలు కలుగుటకై సమస్తము సమకూడి జరుగునని బైబిల గ్రంథములో వ్రాయబడి యున్నది. అవి శ్రమలైనా బాధలైనా, హింస లైనా, కరువైనా, మరణమైనా, ఉపద్రవమైనా, ఏదైనా మన మేలు కోసం దేవుడు జరిపిస్తాడు.

మనం దేవుని గూర్చి, ఆయన మన కప్పగించిన పనుల గూర్చి చింతిస్తే దేవుడు మనల గూర్చి, మన పనుల గూర్చి చింతిస్తాడు. భవిష్యత్తును గూర్చి, చింతించక భవిష్యత్తును అదుపులో పెట్టే భగవంతుని గూర్చి చింతించండి.

చదలవాడ చంద్రమతీ దేవి.

| ఉచితం ! | ఉచితం ! |
|---|---|
| దైవ స్వరూపుడైన యేసు క్రీస్తు జీవితం ఆయన కమనీయ బోధలు తెలిపే అందమైన పుస్తకం ఉచితంగా పొంద దలచు కుంటే మీ చిరునామా ఈ రోజే మాకు వ్రాయండి. పోస్టుఖర్చులు మేమే భరించి మీకు ఉచితంగా పుస్తకం పంపుతాము. | డా॥ ఎస్. జాన్ డేవిడ్,<br>పోస్టుబాక్సు 14,<br>చిలకలూరిపేట<br>గుంటూరుజిల్లా. |

భయంతో దాన్ని కర్తవ్యంబరువు క్రింద నోరుమూయించాను సోదరీ। దురదృష్ట కరమయిన నా బ్రతుకులో పోయినవన్నీపోగా మిగిలి ఉన్నది ఈ కర్తవ్య మొక్కటే।

నీతో మరింత సేపు మాట్లానితే దానినించి కూడ నేను దూరమయి పోతానని భయంకలుగుతోంది దయచేసిలోపకి వెళ్ళిపో।" అంటూ ముఖం మరో వంకకు తిప్పుకున్నాడతడు.

కాని తుళ్యభాగ అంతటలో అతనిని విడిచి పుచ్చలేదు.

"చెప్పవోయీ! నన్ను పరాయిగా భావించకు నీవు బ్రతుకులో పొందగలిగినదేమిటి? పోగొట్టుకున్నదేమిటి? నన్ను నీ సోదరి నా అంగీకరిస్తే ఈఒక్క ప్రశ్న సమాధానం చెప్పు" అన్నదామె.

అతడు తల ఎత్తి దీనంగా చూశాడు.

"సోదరీ! నాకు భార్యాబిడ్డల గురించి నీవు ప్రశ్నించావు. నాకు భార్యా బిడ్డలు ఎలా వుంటారు? ఈ పురుషాకృతిని చూచి నీవు మోసపోయినావు. ఎన్నడయినా నీవు రాతిలోమలచిన శిల్పాలను చూచినావా? వాటికి అందమయిన ఆకృతులుంటాయి కాని చేతనత్వమనేది ఉండదు. సృష్టి కర్తనుమించిన మహాశిల్పులెవరున్నారు?

విధాత అపురూపమయిన ఈ శారీరక సంపదను నాకిచ్చాడు కాని వానిని నగానన్ను కొన్న తరువాత శమంతుడు తన ఆంతరంగిక అంగరక్షకుడుగా నియమించుకోవాలని భావించాడు.

అతడు స్త్రీలోలుడు. అతని అంగరక్షకుడు పురుషుడే అయినా పురుష ప్రకృతి లేనివాడు అయివుండాలి.

అందునించి నన్ను తృతీయునిగా చేయించాడు. ఇక చెప్పవలసినది ఏమున్నది. నేను ఈతని సేవలో పొందగలిగినది బానిసత్వమూపోగొట్టుకున్న మగపోడిమి" అన్నాడతడు తలదించుకు.

అతన్ని ఓదార్చి నీడోక్కలు చెప్పిలోనికి వెళ్ళింది తుళ్యభాగ.

జిలుగు వస్త్రాలతో నిర్మించిన డేరా అది. తన బానిసలు, సేవకులు పైనికులు అందరి కన్నాతాను అధికుడు అని నిరూపించుకునే లాగచూడగానే తెలిసే లాగశమంతుడు దాని ఆకృతిని రూపొందించినాడు. డేరా లోపలే అన్ని సౌకర్యాలు ఉన్నాయి.

వెండితో తయారుచేసిన కమ్మీలను నేలలోకి దింపిదానికి బంగారు తీగలు బిగించారు దానికి జిలుగు వస్త్రాలను అమర్చారు సువిశాలమయిన డేరాలో నాలుగు గదులున్నాయి.



శమంతుని డేరాకు కావలిగా ఉన్నత బలిష్ఠమయిన అంగరక్షకుని దగ్గర నించి డేరాలోపలి ముందు గదిలో కాలు పెట్టింది తుల్యభాగ. అది అతిధులకు శమంతుడు కన్పించే చోటు.

అతను బిడారు పేరుతో సదాదేశద్రిమ్మరి. వివిధ ప్రాంతాలలో చిత్ర విచిత్రమయిన వస్తు సంచయాలను సేకరించి వేరు దూరదేశాలకు తీసుకుపోయి విక్రయించటం అతని వృత్తి

బిడారు విడిది దిగినచోట ఉండే ధనవంతులు అతని వద్ద సరకులను భారీ ఎత్తున కొనుగోలు చేస్తారు. తమవద్ద అధికాధికంగా నిలవ వుండే సరుకులను అతనికి ఇచ్చేస్తారు. వాటిని తరలించుకు పోయి వేరుచోట్ల విక్రయిస్తాడు బిడారు వ్యాపారి శమంతుడు.

ఇది అతనికి నిత్యకృత్యం.

భారీ ఎత్తున వస్తువుల్ని కొనుగోలు చేయాలని సంకల్పించిన ధన స్వాములు ఎవరైనా నేరుగా శమంతునితోనే సంభాషించే అవకాశముంటుంది. అటువంటి వారు వచ్చినప్పుడు కలిసేందుకు అతడు డేరా ముందు భాగంలో ఒక గదికి ప్రత్యేకంగా ఏర్పాటు చేయించుకున్నాడు.

అతిధులు కూర్చునేందుకు ఆగదిలో తన ఔద్ధత్యాన్ని ప్రదర్శించుకునే విధంగా ఆసనాలను అమరించినాడు శమంతుడు.

దానికి అనుకుని లోపల మరో గది ఉంది ఆగదిలో శయ కూ, ఉయ్యా
లకూ అమరికలున్నాయి ఎత్తయిన బల్లమీద అనవాలు పుచ్చుకునే గాజుకుప్పి
లున్నాయి. పెద్దపెద్దపాన పాత్రలున్నాయి.

అక్కడ ఒక యువతి, చాలా మదవతి అర్ధనగ్నంగా తచ్చాడుతోంది ఒక
మగవాడికి ఆనందాన్ని అందించుటకు జీవిత పరమార్థంగా కలిగిన వారిలో
ఒకర్తెగా బ్రతుకు అర్థాలను కుదించుకున్న స్త్రీ! శమంతుడు తన కార్యకలాపా
లన్నింటిని ముగించుకుని, అసత్యవాదనలద్వారా, జాతిద్రోహాన్ని ఆత్మద్రోహాన్ని
సరకు చెయ్యని విధంగా వ్యాపారం జరుపుకొనసాగించిన తరువాత విశ్రాంతికై
ఆగదిలోకి వస్తాడు.

అప్పుడాతనికి మదిర అందించటమో, కొందరు స్త్రీలు శరీరాన్ని మర్దన
చెయ్యటమో జరుగుతుంది వారిలో ఒకర్తెగా ఆమె జీవితం వెళ్ళిపోతోంది.
శయ్యకూ ఉయ్యాలకూ ప్రత్యేకించిన ఆగదిలోకి వస్తాడు. అప్పుడే ఆమెకు
చేయవలసిన పనులంటూ ఉంటాయి.

మిగిలిన సమయమంతటు విశ్రాంతి అనే పేరుతో సోమరితనంగా
చెల్లించి వెయ్యటకు ఆమె చేయవలసినపని. ఆమె మీద వ్యామోహం తగ్గేవరకూ
ఆసోగతి అంతే.

ఆ తరువాత ధనార్జనకు సహకరించటంద్వారానో, ఎడారుల్లో అడవుల్లో
ఎదరయే బిజారుదొంగలపై ప్రాణాలను లక్ష్యపెట్టక పోరాడటంద్వారానో అతని
దృష్టిని ఆకర్షించిన ఒకమగవానికు బహుమానకృతిగా ఇవ్వబడు తుందామె

ఆ వానికు స్త్రీ సుఖాన్ని అందిస్తూ బిడ్డల్నికంటూ చాకిరీచేస్తూ ఆమె శేష
జీవితమంతా చెల్లిపోవాలి

వ్యామోహం ఉన్నంత కాలమే ఆమెను శమంతుడు శయ్యకూఉయ్యా
లకూ ప్రత్యేకించిన గదిలో ఉంచనిస్తాడు. కనీస గౌరవాన్ని అయినా ప్రదర్శి
స్తాడు. ఆ తరువాత ఆమె బ్రతుకు దానిసహాలు,

* ________ ఓ బ్రహ్మచారి నిన్ను చేరి ________ *



రష్యాదేశం బ్రహ్మచారులకు 'స్వర్గం' అంటున్నారు కొంత
మంది రహస్యంగా. అక్కడ వందమంది ఆడాళ్ళకు 85
మంది మగాళ్లే ఉన్నారుట! అంటే మిగతా పదిహేనూ
వేకెన్సీ అన్నమాట. బావుందలేదూ?




అందుకని ఆ గదిలో ఉండగలిగిన కాలమే ఆమె బ్రతుకులో విలువ అయినది సుఖప్రదమయినది. అక్కడ ఎక్కువకాలం ఉండగలిగేందుకు శతధా ప్రయత్నిస్తుందామె. ఉత్తర కోసలకు చెందిన శ్రావస్తి ఆమెపుట్టిల్లు. ఒక స్త్రీ మగవాడికి యివ్వగలిగిన తృప్తి అంతా తన నించి శమంతుడికి అందేలా అమరికలు చేస్తుంది. ప్రస్తుతం ఆ పనులలో తల్లీనురాలయివున్నదామె. పానపాత్రలలోకి పీపాలనించి తోడించిన మధువులను వరిపి సిద్ధంచేసింది. స్ఫటికంతో తయారు చేసిన కుప్పెలను శుభ్రపరచింది. శయ్యమీద ఉయ్యాల మీద పరచిన తఖస్తులను చక్కగా అమర్చి సిద్ధపరచిందామె

ఆ పనులలో ఉండగా ఆ గదిలో కాలు పెట్టింది తుల్యభాగ. ఒక నవాగతురాలు ఎటువంటి ముందు హెచ్చరికలే కుండా ఆ గదిలోకి రావటంతో ఆమె చివ్వున తల త్రిప్పి చూచింది. లోపలి పరిస్థితిని గమనించి వాకిలి దగ్గరే నిలిచి పోయింది తుల్యభాగ,

శ్రావస్తి నగరసుందరి చేస్తున్న పని విడిచి ఆమెకు దగ్గరగా వచ్చింది.

"ఎవరు నీవు?" అని అడిగింది.

శ్రీ ఎన్. టి. రామారావు గారి చైతన్యవంతమైన నాయకత్వంలో సామాజిక న్యాయం, ఆర్థికాభ్యుదయం దిశగా ఆంధ్రప్రదేశ్‌లో ఒక సరికొత్త అధ్యాయానికి శ్రీకారం చుట్టడం జరిగింది.

---

ఎన్ టి రామారావుగారి సారథ్యంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పాలనా నిర్వహణ బాధ్యతల్ని స్వీకరించి, ప్రాధాన్యతాక్రమాన్ని బట్టి ప్రజాహిత కార్యక్రమాల్ని తిరిగి రూపొందించే కృషిలో నిమగ్నమైంది. బలహీనవర్గాల సంక్షేమ కార్యక్రమాలకు నేడు ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యం యిస్తున్నది ప్రజాభ్యుదయ పథంలో ఒక కొత్త శకానికి అంకురార్పణ జరిగింది. సాహసోపేతమైన, క్రియాశీలకమైన కార్యక్రమాలనేన్నిటినో ప్రభుత్వం పకడ్బందీగా అమలు పరుస్తున్నది కొత్త ప్రభుత్వం సాధించిన విజయాలు........ యివిగో.... ...

**★ కిలో 2రూ. లకు బియ్యం.**

ప్రజల ముఖ్యాహారమైన బియ్యాన్ని 6 వేల రూ. ల వార్షికాదాయం మించని వారందరికి కిలో 2 రూ. లకే ప్రభుత్వం సరఫరా చేస్తున్నది.

**★ గ్రామాలకు మంచినీరు.**

వంద మంది జనాభాకు కనీసం ఒక్క మంచినీటి వనరునైనా కల్పించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. ఇంతవరకు 2086 గ్రామాలకు మంచినీటి సౌకర్యాన్ని కల్పించింది.

**★ బలహీనవర్గాల ఇళ్ళ నిర్మాణం.**

ఈ వర్తమాన సంవత్సరంలో ప్రతి జిల్లాలో 10,000 శాశ్వత గృహాల్ని నిర్మించాలని, 2లక్షల కుటుంబాలకు ఇళ్ళస్థలాలను పంపిణీచేయాలని ప్రభుత్వం ఉద్దేశించింది. ఇప్పటివరకు 26,192 కుటుంబాల వారికి ఇళ్ళ నిర్మాణానికి ఆర్థిక సహాయం అందించడం జరిగింది. 1 39 లక్షల బలహీన వర్గాల కుటుంబాల వారికి ఇళ్ళ స్థలాలు పంపిణీ అయ్యాయి.

**★ ఆర్థిక సహాయ కార్యక్రమాలు.**

ఈ కార్యక్రమాల క్రింద 1.17 లక్షల షెడ్యూలు కులాల కుటుంబాలకు, 0 19 లక్షల షెడూలు జాతుల కుటుంబాలకు మార్జిన్ పంపిణీ చేశారు.

★ మహిళా, శిశు సంక్షేమం.

ఆర్థిక సహాయ పథకాలు, ప్రసూతి, గర్భిణీ స్త్రీలకు పౌష్టికాహార కార్యక్రమాలు, ప్రతి జిల్లా ప్రధాన కార్యస్థానాల్లోనూ ఉద్యోగ మహిళా వసతి గృహాలు, తిరుపతిలో మహిళా విశ్వ విద్యాలయం, ఆస్తిలో స్త్రీలకు సమాన హక్కు కల్పించేందుకు హిందూవారసత్వ చట్టాన్ని సవరించే ప్రయత్నాలు.- యివి మహిళలకు సమాజంలో సముచితమైన స్థానాన్ని కల్పించడానికి ప్రభుత్వం తీసుకున్న అభ్యుదయకర చర్యలలో కొన్ని.

★ నిరక్షరాస్యతా నిర్మూలన.

6-11 సం ల మధ్య వయస్కులైన సుమారు 40 లక్షల బాలబాలికల్లో ...క, మానసిక వికాసానికి వీలుగా రూ. 60 కోట్ల ఖర్చుతో కూడిన ...ధ్యాహ్న ఆహార పథకాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టింది. 40 రెసిడెన్షియల్ ...శాలలను ప్రారంభించడం, జాతీయ గ్రామీణ ఉపాధికల్పన కార్యక్రమం ...ర పాఠశాల భవనాల నిర్మాణానికి అధిక ప్రాధాన్యం యివ్వడం, విద్యా...ల్లో కేపిటేషను ఫీజు రద్దుచేయడం, సాంకేతిక విశ్వవిద్యాలయాన్ని ...టు చేయాలని నిర్ణయించడం-యివి ప్రభుత్వం తీసుకున్న మరికొన్ని ...భ్యుదయకరమైన చర్యలు.

గ్రామీణాభివృద్ధి.

పాడిపశువులు, దున్నలు, గొర్రెలు, పంపుసెట్లు మొదలైనవాటిని ...ణులకు సరఫరాచేసి, వారి ఆర్థిక పరిస్థితుల్ని మెరుగుపరచడానికి ...త్వం చర్యలు తీసుకుంటున్నది. 1·24 లక్షల షెడ్యూల్డు కులాలకు ... లక్షల షెడ్యూల్డు జాతులకు చెందినవారితో సహా మొత్తం 1 43 లక్ష...ల కుటుంబాలకు యీ విధమైన ప్రయోజనాన్ని ప్రభుత్వం కల్పించింది.

...రిసేద్యపునీటి ప్రాజెక్టులు.

ప్రాణాధారమైన జీవనదుల జలాలను అడ్డగించి, బంజరుభూముల...లోకి తేవడం జరుగుతుంది. మద్రాసు నగర పౌరుల దప్పిక తీర్చడానికి ...ంచే కృష్ణాజలాలతో రాయలసీమ ప్రజల జీవితాల్లో కొత్త శకానికి నాంది ...ప్రయత్నమే తెలుగుగంగ పథకం. కాక యిలనాటి తెలంగాణా ...తపు సిరిసంపదలను తిరిగి ప్రతిష్ఠించడానికి శ్రీరామసాగర్ ప్రాజెక్టు ...పదశ దోహదం చేయగలదు, శ్రీశైలం ఎడమగట్టుకాలువ రాయలసీమ, ...గాణా ప్రాంతపు రైతుల జీవితాల్లో కొత్త ఆశల్ని చిగురింపచేయగలదు.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

"శమంతుని కోసం వచ్చాను. అతనిని చూడాలి." అని బదులు చెప్పింది తుల్యభాగ. ఆమె వస్త్రధారణ చూచినందువల్ల కలిగిన అవహ్యంతో ముఖం ప్రక్కకు తిప్పుకుంది.

వయసులో ఉన్న ఆడపిల్ల, ఒంటరిగా వచ్చింది. వింతయిన శరీరక శక్తి సంపన్నత కలిగిన దానిలా కూడ కన్పిస్తోంది, ఆమెవల్ల తన కాదయినా దుస్థితి సంప్రాప్తం కావచ్చునన్న అనుమానంతో ముందు దిగులుగా చూచింది ఉత్తర కోసల రాజధాని అయిన శ్రావస్తీనగర సుందరి.

కాని ఆ ఎదుట వ్యక్తి చూపులతో కన్పించే నిర్మలత ముఖముద్రలోని నిశ్చలతగమనించి రవంత మనసుకు కుదుటపర్చుకుంది.

"వారిప్పుడే అశ్వశాలకు వెళ్ళారు మరి కొద్ది సేపటికే తిరిగి వచ్చేస్తారు. అందాకా నీవు ఆగదిలో కూర్చోవచ్చు" అని బదులిచ్చిందామె.

"అలాగే" అని చెప్పేసి అతిధులకోసం ప్రత్యేకించి ఆసనాలు అమర్చిన గదిలోకి వచ్చి కూర్చుంది తుల్యభాగ.

కొద్ది క్షణాల తరువాత కోసల రాజ్యసుందరి అందమయిన నూలువలువలు ధరించి వెలుపలకు వచ్చింది. వొస్తూ ఎండిన ఖర్జూరాలూ, విదేశాలలో సేకరించిన ద్రాక్షపళ్ళు, నగిషీ పనితనం కన్పించేవెండి కుప్పెలలో పెట్టి తీసుకు వచ్చింది.

వాటని తుల్యభాగ ఎదురుగా ఉంచి "తీసుకో" అన్నది అభిమానంగా. కూర్చుని ఆమె ధరించిన నారచీరలవంక రెప్పవేయక చూస్తోంది

"ఎందుకలా చూస్తావు?" అని అడిగింది తుల్యభాగ.

"నీవు ధరించిననార వస్త్రాలు, బంధ పూసలపేరులు చూస్తోంటే విచిత్రంగా ఉన్నాయి. ఇంకా చూడాలని పిస్తున్నాయి" అన్నదామె.

*సినిమాహాల్లో ___________ *

"మీకు స్క్రీన్ బాగా కనబడుతోందా?"

"ఓ! బ్రహ్మాండంగా కనబడుతోంది."

"సీటు మెత్తగా, జరగకుండా, మేకులు వగైరా గుచ్చుకోకుండా బాగుందా?"

"అద్భుతంగా ఉంది."

"ఎదుటివాళ్ళ తలకాయలు అడ్డు పడడం లేదుకదా?"

"ఏమాత్రం లేదు"

"అయితే మనిద్దరం సీ హాట్చుకుందామా."




"ఇలాంటి విమాదేశాలలో ఉండవా?"

"ఉంటాయి. కాని చాల అరుదుగానే కన్పిస్తాయి వానప్రస్థాన్ని తీసుకుని అరణ్యవాసాలను పోయేవారు మాత్రమే నారచీరలు ధరిస్తారు కానిసంతో కొందరు బంరపూసలపేరులు ఆభరణాలుగా ధరిస్తారు ఇంతకూ నీవు వచ్చిన పనేమిటి?" అని అడిగింది శ్రావస్తీనగర సుందరి.

"ఈ శమంతుడు ఎలాంటి వాడో చూడాలనే వచ్చాను. అయినా ఆ కవితో నాకు రవంతయు నాపనిలేదనుకో? అతడే నాకోసం వార్తపంపితే వచ్చాను" అని బదులిచ్చింది తుల్యభాగ

"అయితే నీవు తుల్యభాగ అనేపేరు కలిగినయువతివా? ధన్యి? నేనొక సాహసికురాలయిన అమాయకురాలితో మాట్లాడుతున్నానన్నమాట?" అన్నది కోసల రాజ్యంలోని శ్రావస్తీనగరసుందరి. తనను అమాయకురాలని వ్యాఖ్యానించినందుకు విడ్డూరంగా ఆ సుందరి వంక చూచింది తుల్యభాగ.

తాను సాహసికురాలని అనగలగటం కూడ ఆశ్చర్యకరమే? అత ఆమె సమక్షంలోనే తన గురించిన చర్చ జరిపి వుంటాడు శమంతుడు. వారికి తన గురించి ఎలా తెలిసింది?

"నీవు ఆతని అర్ధాంగివా?" తుల్యభాగ,

"కాదు ప్రేయసిని."

"అంటే దాసివా?"

"విధాత ఇచ్చిన అందచందాలవల్ల నేను ఇంకా దాసిని కాలేదు" మనసు పొరల వెనుక దోబూచులాడిన సంశయ పూర్ణమయిన ఆలోచనల నీడలు దాచుకుంటూ చెప్పింది కోసలరాజ్య సుందరి. ఆ మాటలకు ఉలికిపడింది తుల్యభాగ.

"నీ మాటలు నాకు అర్థమయేలా లేవు" అంది భవితవ్యంలో తనకు పట్టనున్న దుస్థితిని జ్ఞాపకం చేసుకోవడం అందు గురించి ఒక దక్షిణాదియువతితో చెప్పుకోవలసిరావడం ఆమెను బాధించినాయి. కాని మనసు కదిలింది.

ఆమె బాగోగుల గురించి ప్రశ్నించేవారు ప్రపంచంలో ఎవరున్నారు? కన్నతల్లిదండ్రులు ధనకాంక్షతో శమంతునికి అప్పగించేశారు తన అందచందాలకు అబ్బురపడిపోయిన శమంతుడు కన్నవారికి అధిక మూల్యం చెల్లించి కొనుగోలు చేశాడు.

కొన్నివందల యోజనాల దూరంలో ఉన్న ఆ తల్లిదండ్రులు ఎన్నడూ తిరిగి కలుసుకునే అవకాశమే లేదు. బంధువులు ఇంత దూరంవచ్చి పలకరించే వారు ఎవరుంటారు?

మంచి అయినా చెడు అయినా శమంతుడే దిక్కు. అతడు ఇలా కొనుగోలు చేసిన స్త్రీ దాసీలను ఇంతకు ముందు ఎలా దాసులకు యిచ్చివేసాడో తనను కూడా వ్యామోహం తీరగానే అలా ఇచ్చివేస్తాడని తెలుసు. అందునించి అతడు అనుభవించేవాడేకాని అంతర్యాన్ని పంచుకునే వాడు కాదు

ఇంకెవరితో చెప్పుకోవాలి చెప్పుకునే స్వాతంత్ర్యం తనకు లేదు ఒక వేళ అంతరంగికమయిన ఆవేదనను చిరాకుతోని ఏ ఇతర వ్యక్తి దగ్గర అయినా చెప్పుకుంటే అది శమంతునికి తెలిసిపోతుంది.

రేపు పడవలసిన శిక్ష ఈవేళే పడుతుంది.

అందులోంచి మండుతున్న అంతర్యాన్ని అణచుకుని మందు పాతరలా కుములుతోంది కోసల సుందరి

(సశేషం)

అలనాటి చరిత్రలు - ఈనాటి మేటి నవలలు

# శ్రీ ప్రసాద్ రచనలు

(విజయ సీరియల్స్)

| | |
|---|---|
| విజయనగర పతనం-1 | 13.00 |
| విజయ నగర పతనం-2 | 12.00 |
| షాజహాన్ | 13.00 |
| సామ్రాట్ శ్రీరంగరాయ | 10.00 |
| లకుమాదేవి (లల్లాదేవి రచన ఆంధ్రభూమి సీరియల్) | 15.00 |
| ఆర్య చాణక్య | 13.50 |
| అప్పాజీ | 12.00 |
| యుగంధర్ | 13.50 |
| రోషనార | 10.00 |

* అన్ని బుక్ షాపుల్లోనూ దొరుకుతాయి. దొరక్కపోతే కోరిన పుస్తకాల వివరాలు ఒక రూపాయి తగ్గించి M.O. పంపితే మిగిలిన మొత్తానికి V.P.లో పంపుతాము!

నవజ్యోతి పబ్లికేషన్స్

నవజ్యోతి పబ్లికేషన్స్

ఏలూరు రోడ్,
విజయవాడ-520 002.

ఆంజనేయుల్ని తల్లిదండ్రులు అల్లారు ముద్దుగానే పెంచారు. అందువల్ల అతనికి పెంకితనం, మొండితనం లాంటి అపలక్షణాలు రాలేదు గాని ప్రపంచ భయం, భీతి తనంతతానుగా ఏమీ చేయలేని పిరికితనం లాంటిని అలవడ్డాయి. ఒక్కగానొక్క కొడుకు. అందులోను లేక లేక కలిగిన సంతానం కావడంవల్ల ఆంజనేయుల్ని తల్లిదండ్రులు ఎక్కువగా బైటికి వెళ్ళనిచ్చేవారుకాదు. తోటి పిల్లలతో ఆడుకోనిచ్చే వారు కాదు. అతన్ని బైటకు

ఆంజనేయులికి చదువంటే శ్రద్ధ. దేవుళ్ళన్నా, గురువులన్నా. భక్తి పెద్ద మనుషులన్నా పెద్దతనమన్నా, పెద్దలోకమన్నా భయం ఉన్నాయి.

చదువు పూర్తయి చాలా కాలమైనా ఆంజనేయులికి ఉద్యోగం రాలేదు.

అతను ఉద్యోగంలేదని బాధపడినప్పుడల్లా-"బెంగపెట్టుకోకురా - అదే దొరుకుతుంది," అనేది తల్లి,

ఉద్యోగం లేదన్న బెంగ మిగిలిపోయింది. ఉద్యోగం చేయాలన్న కోరిక పెరిగిపోయింది.

# ఓ కండక్టర్ కథ



తోరఘువరావ్ పమ్మి

పంపడానికి భయపడేవారు. దానివల్ల నలుగురిలో మసలాలంటే భయం. స్వతంత్రించి ఏదైనా చెయ్యాలన్నా ఆలోచించాలన్నా భీతి అతనిలో ఏర్పడ్డాయి.

వయసొచ్చి స్కూల్లో చేరాక కూడా అతని పరిస్థితిలో మార్పులేదు,

కొడుకు బెంగపడుతున్నాడని తెల్సిన తలిదండ్రులు బాధపడ్డారు. ఏం చెయ్యాలా అని ఆలోచించారు.

కొడుక్కు పెళ్ళిచేస్తే కాస్త ధోరణి మారుతుందని ఆలోచించారు, ఆంజనేయులికి ఇష్టంలేదు కాని తలిదండ్రుల్ని కాదనలేక వచ్చిన సంబంధం



చూడ్డానికి ఒప్పుకున్నాడు. చూసి పిల్ల నచ్చలేదని చెప్తే సరిపోతుందను కున్నాడు-

పిల్లని చూడ్డానికి తలిదండ్రులతో

కల్సి వెళ్ళాడు.

ం ం ం

ఇందిర మెరుపుతీగలా వుండదుకాని ఆమెను చూడగానే ఎవరికైనా మన

సులో ఓ చిన్న మెరుపు [illegible]. అమెది [illegible] పువ్వులా [illegible] అందంటాయు. [illegible] అందం. [illegible] ఆమె తెలిస్తే పది, అంతకాయ [illegible] దానిలా కనిపిస్తుంది.

ఇందిరకు చిన్నప్పుడే [illegible] సవితల్లి సరిగా చూడదేమోనని [illegible] వత్తి అమ్మమ్మ తీసికెళ్ళింది. ఇంటి కతి అమ్మమ్మ మేనమామ, అతని భార్య బాగానే చూశారు.

ఆంజనేయులు ఇందిరను చూసుకోటానికి వచ్చాడు. చూడగానే అతని మనసులో ఓ మెరుపు కదిలింది. కదిలిన ఆ మెరుపుని డబ్బుమీద ఆలోచన లేని ఆంజనేయులు కప్పెట్టెయ్యకుండా పైటికి తెలియజేసేశాడు.

"నేనీ అమ్మాయిని చేసుకుంటా నాన్నా!" అని అందరి ఎదుటా తండ్రికి చెప్పాడు.

అది విన్న అందరూ ఆశ్చర్య పోయారు.

ఇందిరకు, ఆమె మేనమామకు మాత్రం భయం కలిగింది. ఆమెను చూడగానే చేసుకుంటానని చాలామంది ముందుకు వచ్చారు. కాని కట్నం దగ్గరకు వచ్చేసరికి అందరూ పారిపో యారు.

"తల్లిలేని పిల్లని. మా అమ్మ దానిని చిన్నప్పుడే తీసుకొచ్చింది. కన్న కూతురు కన్నా ఎక్కువగా పెంచాను. మళ్ళీ దాని తండ్రి దాన్ని గురించి పట్టించుకోలేదు. మీరు నచ్చిందన్నారు సంతోషం ...కాని ముందే చెప్పేస్తు న్నాను. నేను ఎక్కువ కట్నం ఇవ్వ [illegible] లాంటి బంగారం [illegible] ఇష్టం. కాని [illegible] దగ్గరలేదు [illegible]. ఊరికే [illegible] లేదు. నాశక్తి [illegible]....

"కట్నం వద్దు. మా వాడికి పిల్ల నచ్చింది. తల్లిలేని పిల్లను [illegible] బుద్ధులు చెప్పించారు మీ [illegible] గొప్పది. మీలాంటి వాళ్ళు ఉండబట్టే ఇంకా ఈ ప్రపంచం ఇలా నడుస్తోంది. మీ [illegible] చేసుకుంటాం.... సామాన్యంగా పెళ్ళి జరిపించండి చాలు" అన్నాడు ఆంజనేయులు తండ్రి....

ఆంజనేయులు తండ్రికేసి గౌరవ భావంతో చూశాడు. ఇందిర ఆంజనేయుల్ని, అతని తండ్రిని కృతజ్ఞతా పూర్వకంగా చూసింది. ఆమె కళ్ళలో నీళ్ళు నిండాయి.

పెళ్ళి జరిగింది.

ఆంజనేయుల్లో కొత్త ఉత్సాహం, జీవితంపట్ల కొత్తఇష్టం ఏర్పడ్డాయి.

మొదటి రాత్రి ఇందిర సిగ్గుతో ముడుచుకు పోయింది. ఆంజనేయులు కూడా బిడియంగానే ఉన్నాడు.

రెండోరోజు రాత్రి కాస్తంత చనువుగా ప్రవర్తించింది. ఆంజనేయుల్లో ఉత్సాహం పెరిగింది. ఆ రాత్రే "ఈ మనిషిని నేనే ముందుండి నడిపించాలి." అనుకుంది ఇందిర.

మూడోరాత్రి "మనం ఇద్దరు పిల్లలతో ఆపేద్దాం." అని ఇందిర అన్న

ప్పుడు ఆంజనేయులు ఆశ్చర్యపోయాడు ఆ శాల్లు అలా మాటాడుతారని అతనూహించలేదు ఇందిర తనకన్నా ఎంతో తెలివైనదిగా ప్రపంచమంతా తెలుసుకున్నదిలా కనిపించింది.

అతనికి తన జీవిత పథాన్ని నిర్ణయించి నడిపించే నేత దొరికినట్టుగా అనిపించింది. అతనికి ప్రపంచమంటే భీతి భయం తగ్గినట్టుగా ఉంది.

అతనెక్కడో చదివాడు,

"ప్రపంచంలో విజయం సాధించిన ప్రతి పురుషుడి వెనకాల ఒక స్త్రీ వుంది" బహుశా వాళ్ళంతా ఇందిర లాంటి వాళ్లేమో అనుకున్నాడు.

పెళ్ళయిన కొత్తలో కొన్నాళ్లు మర్చిపోయాడు కాని ఆంజనేయులికి మళ్ళీ ఉద్యోగం బెంగ మొదలైంది. ఉద్యోగం లేకుండా ఖాళీగా ఉన్నాననే భావన అతనిలోంచి పోగొట్టాలని ఇందిర ఎంత ప్రయత్నించినా ఫలితం కనబల్లేదు....

ఆమె తన మేనమామను సలహా అడిగింది. హైదరాబాద్ వెడితే ఉద్యోగావకాశాలు ఎక్కువగా ఉంటాయని తనకు తెల్సున్నవాళ్లు సహకరిస్తారని అతను సలహా చెప్పాడు.

ఇందిర ఆ విషయం భర్తకి అత్తమామలకి చెప్పి ఒప్పించింది. మొదట ఆంజనేయులు ఇందిర హైదరాబాద్ వెళ్ళడానికి, అతనికి ఉద్యోగం వచ్చాక అతని తలిదండ్రులు హైదరాబాద్ వెళ్ళడానికి నిర్ణయించబడింది.

ఆ రకంగా ఆంజనేయులు దంపతులు హైదరాబాద్ వెళ్ళడం జరిగింది.

చాలా కాలం ప్రయత్నించిన మీదట ఆంజనేయులికి ఉద్యోగం దొరికింది,

అది ...

ఆర్టీసీలో కండక్టరు ఉద్యోగం

అతని ఆనందానికి అవధుల్లేవు. ఇందిరమీద ఆమె మేనమామ మీద కతృజ్ఞతతో అతని గుండె నిండిపోయింది వెనకాల కొద్దిగా ఆసి ఉన్నా స్వతంత్రంగా సంపాదించి బతకాలన్న తాపత్రయం ఉండడం వల్ల ఆ కోరిక తీరబోతున్నందువల్ల అతనికి చాలా చాలా సంతోషం కలిగింది,

ఉద్యోగంలో జాయిన్ కమ్మని ఆర్డర్స్ వచ్చాయి అతన్ని హైదరాబాద్ లోనే ఓ డిపోలో వేశారు. ముందు కొద్ది వారాలపాటు ట్రైనింగ్ ఉంటుంది అదయ్యాక సిటీబస్ లో కండక్టరుగా వేస్తారు.

ఆంజనేయులు ఎన్నోసార్లు సిటీ బస్‌లో ప్రయాణం చేశాడు. అందులో పనిచేసే కండక్టరు ప్రయాణికులతో రఫ్‌గా మాట్లాడం, ఏమాత్రం మర్యాద లేకుండా ప్రవర్తించడం, ప్రయాణికుల మీద గట్టిగా అరవడం, సిటీబస్ తనదైనట్టుగాను, ప్రయాణికులు తన దయాధర్మ భిక్షాలమీద ఆధారపడి ఉన్నట్టుగా ప్రవర్తించడం....ఇవన్నీ చూశాడు.

ప్రతి బస్‌మీద పెద్ద పెద్ద అక్షరాలతో "ప్రజాసేవయే మా కర్తవ్యం" అని రాసి ఉండటం చూశాడు.

బస్‌మీద రాసివున్న దానికి పొంతన లేని కండక్టరు ప్రవర్తనని నిరసించాడు. నవ్వుకున్నాడు.

తనకి ఉద్యోగం రాగానే మొట

మొదట తీసుకున్న నిర్ణయం-ప్రయాణీకులతో మర్యాదగా ప్రవర్తించడం. అలా అనుకున్నప్పుడు అతనికి గర్వం కలిగింది.

ట్రైనింగ్ పూర్తయి పోస్టింగ్ ఇచ్చారు.

తను డ్యూటీకి వెళ్ళాల్సినరోజు రానే వచ్చింది.

పెందలాడే నిద్రలేచి తలంటుపోసుకుని సుల్తాన్ బజారులోని హనుమాన్ గుడికి వెళ్ళాడు. కొబ్బరికాయ కొట్టి గంగ సింధూరం బొట్టుపెట్టుకున్నాడు. ఇంటికి వెళ్ళి తొందరగా భోజనం ముగించుకుని కొత్తగా కుట్టించుకున్న షెరీకాట్ ఖాకీబట్టలు వేసుకున్నాడు.

డ్యూటీకి వెళ్తూంటే ఇందిరఎదురొచ్చింది.

డిపో కెళ్ళగానే టికెట్లు, ఛార్టు వగైరా ఇచ్చి ఆరో నెంబరు రూట్లో ఆరోజు డ్యూటీ చెయ్యమని చెప్పారు. డ్రైవరు బస్ తీసుకొచ్చాడు. ఆంజనేయులు అందులో ఎక్కాడు.

"కొత్తగా చేరావా ?" అడిగాడు డ్రైవరు.

"అవునండి" అన్నాడు వినయంగా ఆంజనేయులు.

"కొత్తగా చేరినోడి, ఈ రూట్లో, పైగా ఈ టైములో ఏసారేంటయ్యా బాబూ!" అన్నాడు డ్రైవరు అదోలా ముఖం పెట్టి.

"నేనీ రూట్లో డ్యూటీ చెయ్యలేనంటారా?" అన్నాడు.

"చూద్దువుగాని.. ఈ రూట్లో పాసింజెర్లంతా ఆఫీసుల్లో పనిచేసేవోళ్ళ

చదూకునేవోళ్లు పేటకి అంతా చదూకున్నోళ్ళేకాని ఆళ్ళ కన్నా మన కంట్రీసైడు గేదెలు కాసుకునే వాళ్ల నయం. అందులోను కొత్తాదంటే నీ తిప్పలు నీ కెట్టేత్తారు."

డ్రైవరు మాటలువిన్న అంజనేయులికి నోటమాట రాలేదు. నాలుక ఎండి పోయింది. వళ్ళంతా నిరుత్సాహం ఆవరించింది.

డ్రైవరుకి యాభై యేళ్ళ వయసుంటుంది పాత సిటీబస్‌లా మనిషి నలిగి పోయాడు బట్టతల ఆకని జీవితానుభవాన్ని చెప్పక చెపుతోంది చుట్టపొగ మింగేసి ముక్కులోంచి వదలడంవల్ల మనిషి నిరంతరం కుదిలా కనిపిస్తున్నాడు. బస్ నడపడం చుట్ట కాల్చడం కన్నా మిలువవన్నట్టుగా ఉన్నాయి అతని చూపులు

"మీ పేరు." అంజనేయులు తెచ్చి పెట్టుకున్న నవ్వుని ముఖం మీద గుచ్చుకుని అడిగాడు.

"పెదయ్య .."

"చూడండి పెదయ్యగారూ నేను డ్యూటీ ఈవేళే చేరాను. నాకంతా కొత్తగా, అయోమయంగా ఉంది మీ మాటలతో మరింత భయం పట్టుకుంది... మీరు కాస్త ఇవేళ్టికి సాయపడితే రేపట్నుంచి నాకు అలవాటై పోతుంది ప్లీజ్ ..."

అంజనేయులు బతిమాల్తూ అడిగాడు

"నా సాయం నీ కేటి ఉపయోగం? స్టీరింగొదిలేసి టికెట్లు కొట్టమంటావా?"

నిజమే. డ్రైవర్ కండక్టర్‌కి ఏ రకంగా సాయం చెయ్యగలడు?. అన్న అనుమానం అంజనేయులికి కూడా కలిగింది.

"అహహా.... అదికాదు, మాట సాయం.... కాస్తంత మీరున్నారన్న ధైర్యం. అదే చాలు."

"నేనుండక బస్సొదిలి ఎల్లి పోతానా ?"

పెదయ్య బస్ స్టార్ట్ చేసాడు.

బస్ డిపోనుంచి సరాసరి ఆర్టీసీ క్రాస్ రోడ్స్ దగ్గరకొచ్చి ఆగింది. అక్కడ ప్రయాణీకులు ఆకలితోవున్న గెద్దల్లా, రాబందుల్లా ఉన్నారు. బిలబిలమని తోసుకుంటూ, రాసుకుంటూ, గెంతుకుంటూ పడుతూ లేస్తూ బస్ ఎక్కేస్తున్నారు. సీట్లకోసం దొమ్మిలాంటిది జరుగుతోంది

కాస్సేపట్లో బస్ బైల్దేరింది.

---

"ఏం గురూజీ! చిట్టిపిపడంకు చిన్నప్పటినుంచి చూడాలని కలలుగన్న బొంబాయి నగరం. ఇప్పటికి చూసివచ్చావన్నమాట!"

"అవును"

"ఎలావుంది సిటీ?"

"నా మొఖంలా వుంది. వున్న నాలుగురోజులూ వర్షం, సిటీ అంతా మోకాలులోతు నీళ్ళు"

...బతికుండగానే నరకాన్ని చూపించే బస్.

పెరుగుతున్న దేశ జనాభాని మీ కళ్ళకు చూపించే బస్.... మనిషి స్వభావంలోని ఖరాన్ని మనిషి అసహాంలోని అట్టడుగుని చూపించే బస్... రాష్ట్ర, దేశ, ప్రాపంచిక రాజకీయాలు మీకు వినిపింపజేసే బస్ ... ఆఫీసులకి చేరేటప్పటికి ఉద్యోగస్తుల్ని నిర్జీవుల్నిచేసే బస్ ... కొన్ని నిముషాల పాటు జీవితేచ్ఛ, అన్న హితవు, శ్రీవాంఛ అన్నీచంపేసి మనిషిని యోగిగా, ఋషిగా చేసే బస్....

బస్ బైల్దేరింది.

ఆంజనేయులు టికెట్లు కొట్టడం మొదలెట్టాడు.

ఎవరి ధోరణిలో వారున్నారు.

డి. ఎ పెంపుదలనుంచి సూట్రాన్ జా.బు దాకా అన్ని విషయాలు చర్చించబడుతున్నాయి.

"టికెట్ సార్ .... టికెట్ ...."

ఆంజనేయులు ఎంతో మర్యాదగా, వినయంగా అడుగుతున్నాడు. టికెట్లు ఇస్తున్నాడు. అలవాటు లేని కారణంగా జనాన్ని తోసుకుని వెళ్ళడం అతనికి కష్టంగా ఉంది.

బస్ చార్మినార్ కంపెనీ దాటగానే ఆపేశాడు డ్రైవరు ... అది లాస్టు టికెట్ ఇష్యూయింగ్ పాయింట్—ఆ స్టేజి దాటేలోగా బస్‌లో ఉన్న ప్రయాణీకులందరికీ టికెట్లు ఇచ్చెయ్యాలి. పైగా ఏ టికెట్లు ఎన్ని కొట్టాడో ఓ

ఘోరంలో రాయాలి.

ఇందులో ఏది చెయ్యకపోయినా చెకింగ్ ఇన్‌స్పెక్టర్ కండక్టర్ మీద కంప్లైంటు రాయొచ్చు

ఆంజనేయులికి అవస్థగా ఉంది,

ఏ ప్యాసింజరుకి ఎంత టికెట్ కొట్టాలో తెలియటంలేదు. ప్యాసింజర్ని అడగాల్సి వస్తోంది. లేదా ఛార్టు చూడాల్సి వస్తోంది.

లేటయిపోతోందని అప్పటికే ప్రయాణీకులు సణుగుడు మొదలెట్టారు ఆ రూట్లో చాలా ఆఫీసులున్న కారణంగా ఆ బస్ చాలా రద్దీగా ఉంటుంది. పైగా పాలిటెక్నిక్ కాలేజీ స్టూడెంట్లు కూడా ఆ బస్ లోనే ఎక్కుతారు, అంచేత ఇంకాస్త జాగ్రత్తగా ఉండాలి.

సిటీలో ఏ ఆందోళన జరిగినా అది పాలిటెక్నిక్ దగ్గర తీవ్రరూపందాల్చి ఆర్టీసీ బస్సుమీద దాని ప్రభావం చూపిస్తుంది,

ఈ విషయం జ్ఞాపకం వచ్చి ఆంజనేయులికి వళ్ళంతా చెమట్లు పోశాయి.

అయినా ధైర్యం కూడదీసుకుని టికెట్లు కొడుతున్నాడు, ప్రయాణీకులు సహకరించడంలేదు. ఒకాయన నలభై పైసల టికెట్ కి పదిరూపాయల నోటిచ్చాడు.

"చిల్లరివ్వండి సార్...."

"లేదయ్యా- చిల్లర చిల్లరంటే ఎక్కణ్ణుంచి వస్తుంది. ప్రతివాళ్లూ బాగా నేర్చారు." -ప్రయాణీకుడు గదిమాడు.

ఆంజనేయులికి ఏం చెయ్యాలో తోచలేదు- టికెట్ వెనకాలరాసి తర్వాత ఇద్దామన్నా- దిగాల్సిన స్టేజి వచ్చేసరికి పదిరూపాయల చిల్లర పోగవదు. అదే కొంచెం ముదిరిన కండక్టరయితే "చిల్లరిస్తే ఇవ్వండి. లేదా దిగండి." అనేవాడు. ఆ విషయం ఆంజనేయులికి, ఆ ప్రయాణీకుడికి కూడాతెలుసు.

కాని ఆంజనేయులు కొత్తగా చేరాడని వాళ్ళకి తెల్సిపోయింది.

"చిల్లరలేకపోతే ఎలాసార్! ఇదేమో ఫస్ట్ ట్రిప్...." ఆంజనేయులు దీనంగా మొహంపెట్టి అన్నాడు.

"ఇదిగో నా దగ్గర ముప్పై పైసలున్నాయి- ఏం చేసినా సరే నీ ఇష్టం" అన్నాడు ప్రయాణీకుడు.

నలభై పైసలయ్యేదానికి ముప్పై పైసల టికెట్ కొట్టడం ఆంజనేయులికి ఇష్టం లేదు. పది పైసల నష్టం అనే భరిద్దామనుకున్నాడు. ముప్పై పైసలు తీసుకుని నలభై పైసల టికెట్ ప్రయాణీకుడి చేతిలోపెట్టాడు.

గవర్నమెంటులో ఓ మాదిరి మంచి ఉద్యోగమే చేస్తున్న ఆ ప్రయాణీకుడు పది పైసల లబ్ధికి యెంతో సంతోషించాడు. పైగా ముసి ముసి నవ్వులు నవ్వాడు.

"ఏవయ్యా- ఆఫీసుకి ఎప్పుడు చేరుస్తావ్? లంచ్ టైంకి ముందా తర్వాతా?" ఓ ఉద్యోగి అడిగాడు.

"వెళ్ళిపోదాం సార్.... కొత్త మూలాన లేటవుతోంది."ఆంజనేయులు సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

"కొత్త బిచ్చగాడికి పొద్దుతెలియదట," వెనకాణ్ణుంచి యెవరో అన్నారు.

ఆంజనేయులు వినవట్టుగా ఊరుకున్నాడు.

యెవరో బెల్ కొట్టారు.

''బాబూ .. యెవరూ బెల్ కొట్టకండి సార్...." ఆంజనేయులు విజ్ఞాపన. ఈసారి గట్టిగా ఒకటికిపదిసార్లు బెల్ కొట్టారు జనం నవ్వులు.

"ఒరేయ్... మన మెల్లాగూ కాలేజీ టైంకి వెళ్ళలేం, బస్‌దిగి రోడ్ పక్కన కూర్చుని టిఫిన్ బాక్సులు విప్పి తినేద్దాం." ఓస్టూడెంట్ అన్నాడు మళ్ళీ నవ్వులు.

టికెట్లు కొట్టడం ముగిసిందనిపించి ''పైడయ్య గారూ- పోనివ్వండి" అన్నాడు.

బస్ బైల్దేరింది.

ఒక్కో స్టేజి దాటుతున్నకొద్దీ జనం ఇంకా ఇంకా యెక్కుతున్నారు. బర్కత్‌పురా సెంటర్ దగ్గర కొచ్చేసరికి బస్ పూర్ణగర్భిణీ గేదెలా ఉంది. టర్న్ తిరుగుతున్నపుడు కుయ్యో మొర్రో మంటోంది.

ఆంజనేయులు ఎంతచెప్పినా లాభం లేదు.

బస్ లిబర్టీ దగ్గరికి వచ్చింది.

ఆంజనేయులు టిక్కెట్లు కొడుతూ వెనకాల్నుంచి కిందకి దిగాడు. ఫుట్ బోర్డు మీదున్నవారికి, ఎక్కబోతున్న పాసింజర్లకి టిక్కెట్లు ఇస్తున్నాడు. అది పూర్తయ్యాక ముందునించి ఎక్కి ఆడాళ్ళకి టిక్కెట్లిద్దామని ఆలోచన. ఆతను కింద ఉండగానే ఎవరో బెల్ కొట్టారు.

డ్రైవరు ఏ పరాకులో ఉన్నాడో తెలియదు. బస్స్టార్టు చేసేసాడు. హోల్డాన్ హోల్డాన్ అంటూ ఆంజనేయులు బస్

వెనకాలే పరుగెత్తాడు. "కండక్టర్ కిందే ఉన్నాడు." అని ఓ పాసింజర్ అరిచాడు. కొంతదూరం వెళ్ళాక డ్రైవరు బస్సాపాడు.

ఆంజనేయులు ముందు నుంచి బస్ ఎక్కాడు

"కండక్టర్ని వదిలేసి వెళ్ళి పోవాల్సింది రేపు సాయంత్రానికైనా ఆఫీసుకు చేరుకోలేం." ఒక ఉద్యోగస్తురాలు మరొకామెతో ఆంజనేయులుకి వినపడేటట్టే చెప్తోంది.

రెండో ఆమె నవ్వుతోంది

ఆఫీసుకు లేటైపోతోందని ప్రతి ఒక్కరు కండక్టరు మీద విసుక్కుంటున్నారు, "నీలాంటి వాళ్ళని ఈ రూట్లో వెయ్యటానికి వాళ్ళకిబుద్ధి లేదటయ్యా?" ఒకాయన మొహంమీదే అడిగాడు.

ఆంజనేయులికి ఉక్కిరిబిక్కిరైనట్టనిపించింది.

ఫస్ట్ ట్రిప్ అయిందనిపించేసరికి కాళ్లు దిగొచ్చారు. మధ్యాహ్నం వరకు ఫరవాలేదు మళ్లీస్కూళ్లు, కాలేజీలు. వదిలేటైంనుంచీ రష్ మొదలవుతుంది.

ఆఫీసులు వదిలే టైముకి మళ్లీబస్ ఒకరకంగా మారుతుంది.

ఆంజనేయులికి ఇప్పట్నుంచి భయంగా ఉంది.

మధ్యాహ్నం మూడు గంటల ట్రిప్ లో సరోజినీదేవి హాస్పిటల్ దగ్గర చెకింగ్ స్టాఫ్ ఎక్కారు.

అప్పుడే బస్‌లో ఎక్కువమంది ప్రయాణీకులు కూడా లేరు వాళ్లు లోకి ఎక్కగానే ముందు ఆంజనేయులుదగ్గర టిక్కెట్లు తీసేసుకున్నారు ప్రయాణీకులందరి దగ్గరా టిక్కెట్లున్నాయో లేవో తనిఖీ చేసారు గళ్ళ బుష్షర్టు వేసుకున్న ప్రయాణీకుడి దగ్గర తప్ప మిగతా అందరి దగ్గర టిక్కెట్లున్నాయి.

ఆంజనేయులకి బాగా గుర్తుంది.

గళ్ళ బుష్షర్టు ప్రయాణీకుణ్ని తను రెండు సార్లు అడిగాడు, రెండుసార్లు అతనుటిక్కెట్టు తీసుకున్నానని చెప్పాడు. చూడ్డానికి చదూకున్న వాడిలా, మర్యాదస్తుడిలా ఉన్నాడు. ఏ శ్రీ అర్ధ వైసలకి అలాంటి వాళ్లు ఎందుకు కక్కుర్తి పడతారో అతనికి అర్థం కాలేదు.

ఏ స్టేజీలో ఎన్నిటిక్కెట్లు కొట్టాడో ఫారంలో నింపలేదన్నది చెకింగ్ ఇన్స్పెక్టర్ చేసిన రెండో ఆరోపణ.

## ఊరయినా అడగలేదు



కార్టూనిస్టులు, బొమ్మలుగీసే ఇండియన్ ఇంక్‌కి - ఇండియాకి ఏ సంబంధమూలేదు. నిజానికి ఇండియన్ ఇంక్ చైనా నుంచి ప్రవహిస్తుంది.

తను కొత్తనీ, బస్ నడుస్తుండగా ఆ ఫారం నింపడం చాతకావటం లేదని ఆంజనేయులు చెప్పాడు. డ్రైవరు కూడా కలుగజేసుకుని కండక్టర్ కొత్తవాడని, రిపోర్టు రాయొద్దని చెప్పాడు.

అడిగే వాడికి చెప్పేవాడు లోకువ.

"ఇకముందు జాగ్రత్తగా ఉండు!" అని హెచ్చరించి ఇన్‌స్పెక్టర్ దిగిపోయాడు.

గళ్ళబుష్షర్ట్‌ని అడిగితే "తీసుకున్నా ననుకున్నాను. గుర్తులేదు." అన్నాడు ఆంజనేయులు టికెట్టిచ్చి డబ్బులు తీసుకున్నాడు. అదే కొంచెం సీనియర్ కండక్టరయితే గళ్ళబుష్షర్ట్ కాలర్ పట్టుకుని బస్‌లోంచి బైటికిగెంటేసేవాడు.

ఆరోజు డ్యూటీ అయ్యిందని పించి క్యాష్ టికెట్లు అప్పజెప్పడానికి ఆంజనేయులు డిపోకి వెళ్ళాడు ఇరవై రూపాయలదాకా క్యాష్‌లో తేడా వచ్చింది. చేతినుంచి కట్టుకున్నాడు.

బాధగా ఇంటికి చేరాడు

డబ్బు కట్టాల్సి వచ్చినందుకన్నా, ఆ రోజు అనుభవాలు తన కళ్ళ ముందు తిరుగుతున్నాయి. తను టికెట్లు కొట్టలేకపోవడం, చిల్లర లేని ప్రయాణీకులు తనని దబాయించడం, కొత్తవాడని జనం అవహేళన చేయడం. తనని ఆట పట్టించిన కుర్రాళ్లు, వాళ్ళ నవ్వులు, తనుబస్ దిగాక బెల్‌కొట్టడం, బస్ కదిలి పోతుంటే దాని వెనకాల

# ప్రకటన

"సౌభాగ్యలత" నవలా ముద్రణ హక్కు, జనరంజని, సత్యం శివం సుందరం, పూజారిణి మొదలైన నవలల పునర్ముద్రణ హక్కులు కావసిసినవారు స్వయముగా వచ్చి సంప్రదించుకొనవచ్చును. ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు

ఇట్లు

కౌసల్యాదేవి

రాజమండ్రి

తనవరకు కొత్తతని తెల్సి ఉద్యోగస్తు వాళ్లు చేసిన కామెంట్లు, నవ్వీన నవ్వులు, తనమీద కంప్లైంట్ రాస్తానన్న చెకింగ్ ఇన్‌స్పెక్టర్, టికెట్ కొనని గ్లాసషర్టు . .

ఇందిర ఇచ్చిన కాఫీతాగి కుర్చీని ఆలోచిస్తున్నాడు. కొత్తవాడులే అన్న జాలి, తోటిమనిషిమీద సానుభూతిలేని ప్రయాణీకులు .... గెద్దల్లా, కాకుల్లా, రాబందుల్లా తనని హింసించిన జనం .. ....

కండక్టర్లంతా ఇందువల్లే రఫ్‌గా, అమర్యాదగా ప్రవర్తిస్తారేమో? మెతగ్గా వుంటే.... అందరూ తనలాగే అవమాన పడతారేమో?

ఏ ఆఫీసులోనో ఉద్యోగంలో చేరితే పైవాడు పనినేర్పుతాడు. స్లోగా చేసినా అర్థంచేసుకుంటాడు ఒకటికి నాల్గుసార్లు చెప్తాడు. విసుక్కున్నా, కసురుకున్నా ఒక్కడే....

కాని కండక్టర్ ఉద్యోగం అలా కాదు.

పబ్లిక్‌తో సంబంధం.. అన్నివందల కళ్లు....నవ్వి, హేళనచేసి, చూపులతో పొడిచి, హింసించి........

ఆంజనేయులికి బాధ.. మనసులో సుళ్లు తిరుగుతున్న బాధ ఇందిర "అలా ఉన్నారేం?" అని చాలా సార్లడిగింది.

"ఏంలేదు." అని మాత్రం చెప్పాడు.

భోజనాలు చేసినప్పుడు కూడా అన్యమనస్కంగా ఉన్నాడు నాలుగు మెతుకులు కతికి లేచి పోయాడు. వంటింట్లో పనులన్నీ ముగించుకుని ఇందిర గదిలో

---

✳ ఓ చిన్న నీళ్ళగుంట దగ్గర గాలం వేసి కూర్చున్న కుర్రాడిని చూచి సాంబమూర్తి గారికి తెగజాలి వేసింది

"ఎప్పట్నుంచి చేపలకోసం కూర్చున్నావ్ బాబూ?" ఆప్యాయంగా అడిగారాయన.

"పొద్దున్నుంచీ కూర్చున్నానండీ."

సాంబమూర్తిగారికి వెంటనే జాలికలిగి జేబులోనుంచి ఓ అర్థరూపాయి తీసి ఇచ్చాడు

"పోనీ ఇప్పటికి ఒకటి రెండయినా పట్టావా?" అడిగారాయన

"ఒకటి రెండేమిటి! మీతో కలిపి ఏడుగురు." అన్నాడు కుర్రాడు ఆనందంగా.

---

**మనోవీచిక**

ఎంత ప్రశాంతంగా వుంటావు
తెల్లగా నవ్వుతూ,
నల్లగా భయంకరంగా,
చల్లగా, హాయిగా,
అణువణువులో పులకింతగా
మనసులోకి ఒక్కసారి
తొంగి చూసి,
పలకరించి పరుగులెత్తావు,

**సౌభాగ్యవతి**

కొచ్చేసరికి ఆంజనేయులు మంచం మీద వెల్లకిలా పడుకుని శూన్యంలోకి చూస్తున్నాడు.

ఆమెకి ఆందోళనగా ఉంది. భర్త ఏంజరిగిందీ చెప్పడంలేదు, లైటు తీసేసి మంచంమీద అతని పక్కనే పడుకుని "ఏమండీ మీరిలా ఉంటే నాకు భయంగా ఉంది. ఏంజరిగిందో చెప్పరూ?" అంది

అతనారోజు జరిగినదంతా చెప్పాడు.

చివర్ని "నేను ఇన్నాళ్లు ఉద్యోగం కోసం తాపత్రయపడ్డాను. కాని ఈ ఉద్యోగం చెయ్యలేను నేనిలాంటి ఉద్యోగానికి పనికిరాను. రేపట్నుంచి వెళ్ళను." అన్నాడు.

ఇందిర భర్తని తన వైపు తిప్పుకుని అతని ముఖాన్ని తన గుండెలకు హత్తుకుంది. అతని కన్నీళ్ళతడి ఆమె గుండెలకు తగిలింది.

"కళ్ళనీళ్లెట్టుకుంటున్నారా? మీరు మగాళ్లు. ఇంత బేలగా ఉంటే ఎలా? నాల్గురోజులు పోయాక అలవాటయిపోతుంది. గళ్ళచొక్కాగాణ్ని కాలరట్టుకుని బస్సులోంచి దింపేసే ధైర్యం మీకే వస్తుంది. ఇప్పటి భయపడి ఈ ఉద్యోగం వదిలేస్తే తర్వాత మీరే బాధపడతారు, కొంచెం ధైర్యంగా ఉండి నిగ్రహం చూపండి." అంది.

అతనామె గుండెల్లో మొహందాచుకున్నాడు. ఆమె గుండెలు మల్లెపూలంత మెత్తగా వెన్నెలంత చల్లగా, చల్లనంత హాయిగా ఉన్నాయి. ఆంజనేయులికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది.

ఆమెను పెనవేసుకున్నాడు.

ఇందిర తన జీవితాన్ని సక్రమంగా నడిపేట్టు చూసే కండక్టర్‌లా అనిపించింది కండక్టర్ ఆంజనేయులికి.

○

---

"పెళ్ళయి పాతికేళ్లయిన భర్త భార్యకు పంపే గ్రీటింగ్ కార్డులున్నాయా?"

"అదేమిటి సార్! మీకు పెళ్ళయి అన్నేళ్ళయినట్టు కనిపించటం లేదే."

"ఓ! సారీ! పెళ్లయి మూడేళ్లే! కానీ పాతికేళ్లయినట్టు అనిపిస్తోంది."

---

# అనుభవం కావాలి!



వి. మోహన్ కుమార్

## 17

ఇంటి ఎదురుగా కారాగడంతో బయటకొచ్చాడు పరబ్రహ్మం. ఆనంద రావు, స్వప్న కారులోంచి దిగారు

"రండి. రండి. తండ్రీ కూతుళ్ళిద్దరూ ఇలావచ్చారు. ఏమిటో విశేషం?"

"విశేషం, నువ్వు ఖాళీగా ఉండడమే" అంది స్వప్న లోపలున్న ప్రకాష్ ఆ మాటలు విన్నాడు పరిచయం ఉన్న గొంతు వినిపించడంతో వాటిని మరింత జాగ్రత్తగా విన్నాడు సందేహం లేదు అది స్వప్న గొంతే.

ఇద్దరూ లోపలికి వచ్చారు వాళ్ళనిచూసి లేచాడు ప్రకాష్ ప్రకాష్ని చూసిన స్వప్న తలదించుకుంది. స్వప్న పక్కకి ఆనందరావుని చూసి ఆశ్చర్య పోయాడు ప్రకాష్ స్వప్న ఆనందరావు కూతురా? ఆమె తనలాంటివాణ్ని ఇష్టపడ్డం ఎంత ఆశ్చర్యం!

"రండి కూర్చోండి" పరబ్రహ్మం ఏమీ ఎరుగనట్టుగా ప్రకాష్ని స్వప్నకి పరిచయం చేసాడు. స్వప్న, ప్రకాష్లు చిరునవ్వుతో పలకరించు కున్నారు

కాసేపు కబుర్లయ్యాక ఆనందరావు, స్వప్నలు వెళ్ళిపోయారు.

o o o o

"స్వప్నా నిన్నో సంగతి అడగాలి" అన్నాడు ప్రకాష్

"అడగండి" అంది స్వప్న వంచిన తల ఎత్తకుండానే. వీచే చిరుగాలికి ఎగురుతున్న ముంగురులు ఆమె నుదుటి మీదపడి కొత్త అందాన్ని ఇస్తున్నాయి.

"నువ్వు ఆనందరావు గారి కూతురువని తెలియకుండా పోతే ఏ సందేహం లేకుండా ఈ ప్రశ్న అడిగేవాణ్ని: ఇది తెలిసాక అడగాలంటే భయంవేస్తోంది"

"ఎందుకు"

"నువ్వు అపార్థం చేసుకుంటావేమోనని"

"పర్వాలేదు అడగండి"

"నన్ను పెళ్లిచేసుకోడం నీ కిష్టమేనా"

స్వప్న తల దించుకుంది.

"పొరపాటున అడిగితే క్షమించు

స్వప్న ఈ ప్రశ్నవస్తుందని ఎన్నాట్నుంచో అనుకుంటోంది. అది అనుకున్నదానికన్నా ఆలస్యంగా వచ్చింది.

ప్రకాష్ అంటే తనకిష్టమే అయితే తన భర్త తండ్రి ఆస్థిపాస్తులకు వారసుడు కావాలి గొప్పవాడు కాకపోయినా వాటిని నిలబెట్టగల సమర్థుడు కావాలి తండ్రి తనకు చెప్పకపోయినా దీన్ని ఆశిస్తున్నాడు. అందువల్ల ప్రకాష్ని ఒప్పుకుంటే ముందు అతని సమర్థతని స్టడీ చెయ్యాలి.

"నేను ఆలోచించుకుని చెప్తాను" అంది స్వప్న.

"సరే"

o o o

# 18

"నేను ఏదేనా ఉద్యోగంలో చేరాలనుకుంటున్నాను నాన్నా" అడిగింది స్వప్న.

※ జరిగిన కథ ※

(ప్రశాంత్ హాస్పిటల్లో కోలుకోగానే అతనికి డ్రైవర్గా ఉద్యోగం ఇప్పించగలనని చెప్పాడు భాస్కర్.... కళాభారతి హాల్లో ప్రకాష్ చిత్రకళ ప్రదర్శనలో స్వప్న విచిత్రానుభూతి ! చిన్న అప్రిపియేషన్-బుల్లిథ్రిల్, జెష్ట్ సస్పెన్స్,- ఇరువురికీ ఆనందరావు రథసారథిగా ప్రశాంత్ కుదిరాడు- సరిగ్గా ఆ కార్లోంచి ఆనందరావు, ప్రశాంత్లు ప్రకాష్ స్వప్నలని చూశారు.... చిరు గుండె చప్పుడు.... ఫ్లయిట్ టైమ్ అర్జెన్సీలో ప్రశాంత్కి స్వప్న సందర్శనం జరిగింది....)

"నీకు ఉద్యోగం ఎందుకమ్మా" ప్రేమగా చూసి ఆశ్చర్యపోతూ అన్నాడు ఆనందరావు.

"నాకు తోచటం లేదు"

"నువ్వు మగవాడివయ్యుంటే ఈపాటికే నిన్ను కంపెనీలో జేర్చివుండే వాణ్ని. ఆ తర్వాత దాన్ని నడపడానికి కావలసిన తర్ఫీదు ఇచ్చేవాణ్ని. కానినాలుగు రోజుల్లో పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయేదానివి నీకాతలనొప్పి ఎందుకు"

"ఉన్న నాలుగురోజులు తోచకొట్టి చావాలా నాన్నా"

"సరే. నీ వంత కాలక్షేపం కావాలనుకుంటే ఎక్కడో ఎందుకు మన కంపెనీలోనే చేద్దువు గాని. నీకూ కంపెనీ సంగతులు తెలుస్తాయి" అంటూనే ఆనందరావు "సరిగా నీకు నీ క్వాలిఫికేషన్ ఆధారంగా ఉద్యోగం ఇవ్వొచ్చు. ఎప్పుడు చేరతావ్"

"ఈ రోజే"

ఆనందరావు ఆలోచనలో పడ్డాడు. ఇన్నాళ్ళు లేనిది స్వప్న ఈ రోజు ఉద్యోగంలో చేరతాను అందంటే కారణం ప్రకాష్. అందువల్ల ఆమెను అతని దగ్గర వేస్తే బాగుంటుంది. ఒకరి కొకరు చేదోడు వాదోడుగా ఉంటారు. ఒకరి సామర్థ్యం ఒకరు తెలుసుకుంటారు ఇద్దరూ కంపెనీ పని అవగాహన చేసుకుంటారు ముందు ముందు అది తనకే మంచిది.

"సరే, మార్కెటింగ్‌లో పనిచెయ్యి. కాస్మెటిక్స్ మార్కెటింగ్ ఆసక్తిగా ఉంటుంది. కంపెనీ గురించి అన్ని వివరాలు తెలుస్తాయి"

స్వప్న కంపెనీకి వెళ్ళింది.

ప్రకాష్‌ని కలిసింది.

"నేను ఈ రోజునుంచి ఈ సెక్షన్లో చేరుతున్నాను" అంది.

"అవును, ఉదయం నాన్నగారు చెప్పారు అయినా నువ్వు ఉద్యోగంలో ఎందుకు చేరుతున్నావో అర్థం కాదు. అనవసరంగా ఈ బాదర బందీ ఎందుకు నేనే నీ స్థితిలో ఉంటే ఇంట్లో హాయిగా కాలుమీద కాలేసుక్కూర్చునే వాణ్ని" అన్నాడు ప్రకాష్. ప్రకాష్ స్వప్న కలుసుకుని అప్పటికి ఏడాది దాటింది. ఈ ఏడాదిలో ప్రకాష్ గురించి చాలా తెలుసుకుంది స్వప్న జీవితాన్ని తేలిగ్గా హాయిగా గడిపెయ్యాలని కోరుకునే మనిషి అతను. అలాంటి మనస్తత్వం తనకి నరిపడదు.

"ఇంట్లో బోరు కొడుతోంది" అంది స్వప్న.

"అంత పెద్ద ఇల్లు సరిదిద్దాలంటే ఇరవైనాలుగ్గంటలు సరిపోదు"

"ఇల్లు పెద్దదయితే మాత్రం అక్కడ ఏముంది, ఉన్నది ఇద్దరు మనుషులు, అరడజను పనిమనుషులు. అసలు పని ఉండదు"

"నాకు ఉద్యోగం చేసే ఆడవాళ్ళ కన్నా ఇంట్లో ఉండి ఇల్లు చక్క-దిద్దుకునే వాళ్ళంటే ఇష్టం."

స్వప్న ఆశ్చర్య పోయింది. ప్రకాష్ ఇంత నిర్మొహమాటంగా మాట్లాడ్తాడనుకోలేదు. ఆమెకి ఏం మాటాడాలో తెలియలేదు. ప్రకాష్ పనిలో మునిగిపోయాడు. అతడు పెయింట్ చెయ్యబోయే చిత్రం తాలూకు అవుట్ లైన్ గీస్తున్నాడు.

చేస్తున్న పనిమీద ఏకాగ్రత లేకుండా ఇంకోపనిమీద దృష్టినిలిపే వాళ్ళంటే స్వప్నకి గౌరవం లేదు. కాసేపు కూర్చుంది. ప్రకాష్ మాట్లాడ లేదు. తను ఆఫీసులో పనిచెయ్యడం ప్రకాష్కి ఇష్టం లేదా!

"నేను సెక్షన్లోకి వెడతాను" లేచింది స్వప్న

"సరె"

ప్రకాష్ సంతోషిస్తాడని, ఆఫీసులో అన్ని ఏర్పాట్లుచేసి, తనని రిసీవ్ చేసుకుని పనిలో చేదోడు వాదోడుగా ఉంచుకుంటాడని ఆశించింది స్వప్న. నిర్లిప్తమైన అతని ప్రవర్తనకి ఆమె హృదయం చివుక్కుమంది.

ఆమె సెక్షన్లోకి వెళ్ళింది. డిప్యూటీ మేనేజర్ స్వప్నని చూసి ఆశ్చర్య పోయాడు. ఆమె ఆరోజు నుంచి సెక్షన్లో చేరుతుందని తెలుసుకుని హడావుడి పడిపోయాడు.

"అయ్యో మీరు వస్తారని ఏ మాత్రం తెలిసినా ఈ పాటికి మీ సీట్ ఏర్పాటు చేసి ఉంచేవాళ్ళం ఉండండి చూస్తాను." అతను కాలుగాలిన పిల్లిలా సెక్షనంతా తిరిగాడు.

"మేడం మీరు రేపు రాకూడదూ, రేపు మీరు వచ్చేసరికల్లా ఓ గది ఖాళీ, చేయించి మీ సీటు ఏర్పాటు చేస్తాను"

"సరె" అని స్వప్న వెళ్ళిపోయింది

తను వస్తున్నానని తెలిసికూడా ఏ ఏర్పాటు చెయ్యని ప్రకాష్ మీద కోపం వచ్చింది ఆ సెక్షన్లో వాతావరణం ఆమెకి నచ్చలేదు.

జరిగిన సంగతి ఆనందరావుకి చెప్పి ఉంటే ఒకరిద్దరి ఉద్యోగాలు ఊడి ఉండేవి

"దీన్ని నేనే సంస్కరిస్తాను" అనుకుంది స్వప్న

# 19

'స్వప్నా కాస్మెటిక్స్' మార్కెటింగ్ మేనేజర్ ఉద్యోగానికి పేపర్లో పడ్డ ప్రకటనని చూసి తోకతొక్కిన తాచులా లేచాడు ప్రకాష్. తను ఉండగా ఈ ఉద్యోగానికి ప్రకటన వెయ్యడంలో అర్థం ఏమిటి? ఆనందరావు గారి దగ్గరకెళ్ళి ఆ సంగతి అడిగాడు.

"కూర్చోండి, మరో మేనేజర్ కూడా ఉంటే పని మరింత బాగా ర్యచ్చునని అనుకున్నాం ఇప్పుడు మనం కొన్ని విషయాల్ని చూసీ చూడనట్టు లేసున్నాం వాటినికూడా జాగ్రత్తగా చూసుకోవాలంటే మరో వ్యక్తి అదనంగా వాలనిపించింది."

"ఏమో ఈ ప్రకటన చూడగానే నాకు ఉద్వాసన చెప్పే ఆలోచన చేస్తున్నా టా అనిపించింది అందువల్ల అడిగాను"

ప్రకాష్ రియాక్షన్ కి ఆనందరావు ఆశ్చర్యపోయాడు స్వప్నే ప్రకాష చే పడి వుండకపోతే అతనికి ఏనాడో ఉద్వాసన చెప్పేవాడు. ఎందువల్లంటే ని మూలంగా కంపెనీకి ఒరిగేది ఏదీ లేదు.

ఇంకొక మేనేజర్ కోసం ప్రకటన ఇవ్వడంలో ఉద్దేశం ఇదే. కా ధ్యతాయుతంగా ఉన్నవాణ్ణి తీసుకొచ్చి ముఖ్యమైన విధుల్ని అతనికి అప్ప వాలని.

రేపు అతనికి స్వప్ననిచ్చి పెళ్ళిచేస్తే ఈ కంపెనీని బాధ్యతాయుతంగా నగలుగుతాడా ?

అలా నడపలేకపోతే ఏం చెయ్యాలి

ఆనందరావు దిగులు పడ్డాడు. తన ఇష్టాఇష్టాలు ఎలావున్నా ఈవిషయంలో

# శ్రీ ఆంజనేయ చరిత్ర

హనుమద్భక్తులకు, ఉపాసకులకు, హనుమన్మంత్ర విషయమై పరిశోధన దలచిన వారలకు అత్యంత సులభ శైలిలో ఒక్క తెలుగుభాషలోనే వెలు న శ్రీ పరాశర మహర్షిచే అందించబడిన "శ్రీ ఆంజనేయ చరిత్ర" 80 ములు 7 పుస్తకములుగా వెలువడినది.

7 పుస్తకముల ధర రు : 30/-

ముందుగా రు 30/-లు ఎం.ఒ. ద్వారా పంపిన వారికి పోస్టేజీకి వి.పి పి. బడు ను

శ్రీ హనుమంతుని గూర్చి పూర్తి వివరములు తెలుసుకొనుటకు, మంత్ర, శాస్త్రము తెలుసుకొనుటకు ఈ ఒక్క గ్రంథమే అనేక విషయములను ంచగలదు

వివరములకు :

## శ్రీ హనుమత్సేవాసమితి

కాపూరివారివీధి, సత్యనారాయణపురం, విజయవాడ - 520 011

స్వప్న ఇష్టప్రకారం జరపాలని నిశ్చయించుకున్నాడు. కాబట్టి దిగులు అనవసరం. తనని తాను సరిపెట్టుకున్నాడు.

"అదికాదు ఒకవేళ మీకు ముందు ముందు ప్రమోషన్ వస్తే మీ సీట్లో ఉండడానికి ఇంకొకతను కావాలి కదా అతనికి ఇప్పట్నుంచే తర్ఫీ ఇద్దామని" ఆనందరావు మాటలు ప్రకాష్‌కి సంతోషాన్ని కలిగించాయి. ఇప్పుడు రాబోయే అతను తనకు ప్రత్యర్థి కాదు, వారసుడు.

"మనకు వద్దంటుకునే ఓపిక ఉంటే జీవితం వద్దించిన విస్తరి."

ఎదురుగా ఉన్న పోస్టర్ని చూసాడు ప్రవీణ్. కరెక్ట్ తన నమ్మకమూ అదే. ప్లాన్‌తో సాధించలేనిది లేదు. ఎవరేనా ఫెయిలయ్యారంటే కారణం ప్లాన్ సరిగ్గా తీకపోడం లేదా ఆ ప్లాన్‌ని సరిగ్గా అమలు చెయ్యలేకపోడం -

తనకన్న ఎస్సెట్ ఎక్కువే. ప్లానింగ్- అందువల్లే ఎప్పుడు విజయం వరిస్తుంది.

చదువు అయిపోయింది.

ఇప్పుడు జీవితంలో తదుపరి అధ్యాయం స్వర్గానికి నిచ్చెనని సంపాదించుకోడం అంటే ఒక్క దెబ్బతో తనకి లిఫ్ట్ ఇచ్చే మామగార్ని సంపాదించుకోడం. అదే జరిగితే ఆ తర్వాత అంతా పండగే

మనిషి పుట్టుక ఓ యాక్సిడెంట్. ఓ వీర్యకణానికీ, అండానికీ, ప్రకృతి సిద్ధంగా జరిగే యాక్సిడెంట్‌లోంచి మనిషి పుడ్తాడు, అందువల్ల ఎవరు ఎవరికి పుడతారో ఎవరూ చెప్పలేరు, ఫలానా వాడి కొడుకుగా పుట్టాలి అని ఎవరేనా కోరుకుంటే అది జరగడం అసాధ్యం కాని పేద ఇంట్లో పుట్టినవాడు గొప్పింట్లోకి వెళ్ళలేకపోయామే అని నిరాశతో కృంగిపోవలసిన పనిలేదు భగవంతుడు అంత క్రూరుడుకాదు, అందువల్లే మనిషి జీవితంలో తండ్రి తర్వాత మళ్ళా అంతవాడ్ని ఇంకోణ్నిచ్చాడు అతనే మామగారు. మన తండ్రిని మనం ఎన్నుకోలేం. అయితే మామగార్ని ఎన్నుకోగలం. ఇది మన చేతుల్లో ఉంది. అందువలనజీవితంలో సక్సెస్‌లో ఏభై శాతం మన చేతుల్లో ఉంది. ప్రేమ, దోమ అంటూ చేతులు కాల్చుకోకుండా దీనిమీదే దృష్టినిలవాలి - ఇదీ అతని సిద్ధాంతం అదే అందరికీ చెప్తాడు.

తను పేదింటిలో పుట్టినా గొప్పవాడవుతాడు ఆ నమ్మకం తనకుంది.

అతను కాఫీ తాగుతూ పేపర్ చూస్తున్నాడు

'స్వప్నా కాస్మెటిక్స్' లో మార్కెటింగ్ మేనేజర్ ఉద్యోగానికి ప్రకటన చూసి ఎగిరి గంతేసాడు.

స్వప్నా కాస్మెటిక్స్ అంటే ఆనంతరావుగారి కంపెనీ. 'గుడ్ మంచి అవకాశం'

అతను డైరీ తీసి చూసాడు.

అందులో ఆ ఊర్లో ఉన్న గొప్పవాళ్ళు పేర్లు, వివరాలు, వాళ్ళ అమ్మాయిల వివరాలు ఉన్నాయి. వాటిల్లో ఫస్ట్‌రాంక్ ఆనందరావుగారు స్వప్నలది.

డైరీని మళ్ళీ ఓసారి చ వాడు,

ఆనందరావు : బిజినెస్ మాగ్నెట్.

వయసు యాభై సంవత్సరాలు. సిటీలో నాలుగు ఇళ్లున్నాయి. అయిదు కంపెనీలకి అతను ఛైర్మన్. ఇంకా పది కంపెనీల్లో వాటాలున్నాయి, వాటిల్లో డైరక్టర్ పోస్టుంది స్థిర చరాస్థులలో కలిపి అతని ఆస్తి నాలుగయిదు కోట్లుంటుంది. భార్య చాలా ఏళ్ళక్రితం చచ్చిపోయింది కూతురంటే ప్రాణం కూతురు పెళ్ళి చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు. అమాయకుడు, జోళామనిషి, ముఖ్య స్నేహితుడు పరబ్రహ్మం.

స్వప్న ఆనందరావు ఏకైక కుమార్తె అందగత్తె, ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని కోరుకుంటోంది. ఆనందరావుకి ఆమె ఎంతంటే అంతే స్వప్నకి తండ్రంటే ఎంతో గౌరవం. కాబట్టి తండ్రికోసం ఏ త్యాగమెనా చెయ్యచ్చు కాబట్టి వీళ్ళతో వ్యవహరించే వాడు ఇద్దరితోను మంచిగా ఉండాలి. ఇద్దర్నీ ఇంప్రెస్ చెయ్యాలి.

సుదర్శన్ : ....... ........................................

ఇలా అందరి వివరాలు సేకరించి దాంట్లో వ్రాసుకున్నాడు. ఓ నిమిషం ఆలోచించి అప్లికేషన్ పడేసాడు,

## 20

ఉద్యోగంలో చేరిన స్వప్న ఆఫీసులో విషయాలన్నింటిని క్రమక్రమంగా అవగాహన చేసుకుంటోంది, ప్రకాష్ ఉద్యోగంలో చేరి ఏడాది దాటినా తన దంటూ ప్రత్యేకంగా ఏమీ చెయ్యలేదు. టైంకి ఆఫీసుకి వస్తాడు గదిలో కూర్చుంటాడు. ఆఫీసు విషయాలన్నీ డిప్యూటీ మేనేజర్‌కి వదిలేసి తన ధ్యానలో తనుంటాడు. తన కోసం వచ్చిపోయే విజిటర్స్‌తో కబుర్లు చెపుతూ కూర్చుంటాడు. అతని దగ్గ కి ఎవరూ సలహా కోసం వెళ్ళరు. "ఏం చేసారని" అడగ డానికి అతను ఎవర్నీ పిలవడు ఆనందరావుగారు అతన్ని ప్రత్యేకంగా తీసుకున్నారని అందరికీ తెలుసు. ఆ కుర్రాళ్లో అలా తీసుకోడంలో ఏదో అంతరార్థం ఉందని ఊహించారు వాళ్లు, అందువల్ల అతన్ని ఎవ్వరూ ప్రశ్నించరు.

అతను స్వప్నను చీటికి మాటికి పిలిచేది కబురు చెప్పడానికి, తన కళాఖండాల గురించి ఆమె అభిప్రాయం తెలుసుకోడానికి. ఆమె 'బాగుంది' అని పొడిగితే కొండెక్కినంత సంబర పడేవాడు. స్వప్న ఉద్యోగంలో చేరి వారం

జులైనా అతను ఒక్కసారి కూడా ఆమెతో ఆఫీసు పని గురించి చర్చించ లేదు.

ఆ ఆఫీసులో మేనేజర్ ఉన్నా ఎవరి నిర్ణయాలు వాళ్ళు తీసుకుంటారు. ఎవరికితోచింది వాళ్లు చేస్తున్నారు. స్వప్న దాన్ని గమనించింది. ప్రకాష్ రేపు కంపెనీకి పూర్తిగా వారసుడయితే కంపెనీ మొత్తం ఇలాగే నడుస్తుందా ? ఇలా ఎంత కాలం నడుస్తుంది ?

తను ఉద్యోగంలో చేరడం మంచిదయింది. లేకపోతే రంగు రంగుల కలల్లో ఇవన్నీ తెలుసుకునేది కాదు. తను ఆనందించినా పెళ్ళిమూలంగా తండ్రి బాధ పడేవాడు. ఆయన తన కిచ్చిన స్వేచ్ఛని దుర్వినియోగం చేసినట్టయ్యేది.

స్వప్న ఆఫీసు తీరు తెన్నుల్ని జాగ్రత్తగా గమనించి తండ్రికి చెప్దామను కుంది. కాని కంపెనీలో మరో మేనేజర్ కోసం ప్రకటించారని తెలుసుకుని తండ్రి దూరదృష్టికి సంతోషించింది అంటే ఆయన ఇవన్నీ తెలుసుకున్నాడన్న మాట.

అనందరావు స్వప్న ప్రకాష్‌ల మధ్య దూరం పెరగడాన్ని గమనించాడు. స్వప్న ప్రకాష్‌ని దూరంగా ఉంచుతున్నట్టుగా కూడా గ్రహించాడు. కారణం ఆయనకి అంతుపట్టలేదు. వాళ్ళిద్దర్నీ మళ్ళీ కలపాలంటే ఏం చెయ్యాలి ? ఏదేన అపార్థం ఉంటే దాన్ని ఎలా తొలగించాలి.

ఇన్ని రోజులు ఆలస్యం అయినా స్వప్న తనకు నచ్చిన వ్యక్తిని ఎన్నుకున్నందుకు సంతోషించాడు, వాళ్ళిద్దరూ దగ్గరవుతున్నందుకు సంబరపడ్డాడు. తన బాధ్యత తీరబోతోందని హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు.

కాని కథ మళ్ళీ మొదటి కొస్తోందా ?

# 21

"వచ్చిన అప్లికేషన్లలోంచి ఈ అయిదుగుర్ని సెలక్టు చేసాను. మీరు ఏదో టైం చెప్తే ఇంటర్‌వ్యూకి పిలుస్తాం" పర్సనల్ మేనేజర్ అనందరావుగారికి అప్లికేషన్లు చూపించాడు.

వాటిని పరిశీలిస్తున్న ఆయనకి ఒక అప్లికేషన్ని చూడగానే ఆ వివరాన్ని ఎక్కడో చూసినట్టు గుర్తొచ్చింది. జాగ్రత్తగా గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నించాడు.

ప్రవీణ్ !

ఇది కంప్యూటర్ సూచించిన రెండో పేరు

ప్రకాష్ స్వప్నల మధ్య దూరం ఏర్పడుతున్న సమయంలో తనంతట తానుగా ఈ అప్లికేషన్ రావడం కేవలం యాదృచ్ఛికమా లేక భగవంతుడు చేసిన ఏర్పాటా ?

"ఈ అప్లికేషన్ ఇక్కడ వదిలివెళ్ళండి తర్వాత పంపిస్తాను" అన్నాడు అనందరావు.

అతడు వెళ్ళిపోయాడు.

ఆనందరావు డైరీ తెరిచి దాంట్లో వివరాల్ని, అప్లికేషన్లోని వివరాన్ని పోల్చి చూసాడు అవి సరిగ్గా సరిపోయాయి. అంతే -

ప్రవీణ్ స్వప్నా కాస్మెటిక్స్ మార్కెటింగ్ మేనేజర్ అయ్యాడు. అంతే కాదు-

---

* పెద్ద సినిమానటి: హల్లో బాబూ నేనంటే నీకు తెగ అభిమానమనుకుంటాను, ఇప్పటి కిప్పుడే ఆరుసార్లు నా ఆటోగ్రాఫ్ తీసుకున్నావ్.
చిన్న కుర్రాడు : కాదండీ మీ సంతకాలు ఇరవై సేకరిస్తేగాని నా అభిమాన నటుడి ఆటోగ్రాఫ్ ఒకటి మార్చడానికి వీలు పడదు.

ఇంటర్వ్యూలో ఆనందరావుని బాగా ఇంప్రెస్ చేసాడు

ప్రవీణ్ పథకంలో రెండో అంశం పూర్తయింది. ఇక తర్వాత అంశం. స్వప్న హృదయంలో చోటు సంపాదించడం.

ప్రవీణ్ వ్యూహాన్ని రూపొందిస్తున్నాడు.

○ ○ ○ ○

"ఈయనే ప్రవీణ్ మన డిపార్టుమెంట్‌లో కొత్తగా మేనేజర్‌గా చేరాడు" పర్సనల్ మేనేజర్ ప్రవీణ్‌ని ప్రకాష్‌కి పరిచయం చేసాడు.

"గుడ్ మార్నింగ్" ప్రకాష్‌తో కరచాలనం చేసాడు ప్రవీణ్.

తనలాగే అందంగా ఉన్న మరో కుర్రాణ్ణి చూడగానే అసూయ పడ్డాడు ప్రకాష్.

"ఇతనే అప్పటి విలన్" అనుకున్నాడు ప్రవీణ్. స్వప్న అప్పుడు అక్కడే వుంది.

"ఈవిడే స్వప్న" స్వప్నని ప్రవీణ్‌కి పరిచయం చేసాడు.

ప్రవీణ్ స్వప్నని చూసాడు. ఒక్క క్షణం, తల పక్కకి తిప్పుకోలేక పోయాడు! "జీవితంలో దొరికితే ఇలాంటి అమ్మాయి దొరకాలి" అనుకున్నాడు.

స్వప్న ప్రవీణ్ని చూసింది.

చక్కగా దువ్వుకున్న జుట్టు, ఒక వెంట్రుకకూడా రేగకుండా క్రమబద్ధంగా ఉంది సున్నగా గీసుకున్న గడ్డం మెరుస్తోంది, ఎక్కడా మడత నలగని బట్టలు, చక్కగా పాలిష్ చేసుకున్న బూట్లు అతను తీసుకునే శ్రద్ధకు ప్రతిబింబంగా ఉన్నాయి.

"ప్లీజ్ టు సి యు" అన్నాడతను. అతని కంఠ స్వరం గంభీరంగా ఉంది ఉచ్ఛారణ స్పష్టంగా స్టయిలిష్గా ఉంది అతను అక్కణ్ణుంచి వెళ్ళి పోయాడు.

రెండు గంటల తరా త అతని దగ్గర్నుంచి పిలుపొచ్చింది,

"కూర్చోండి" అన్నాడతను.

"ఆఫీసులో అందరూ ఏ ఏ పనులు చేస్తున్నారో తెలుసుకుంటున్నాను ఇక్కడ పని తీరుని అవగాహన చేసుకుంటున్నాను దయచేసి మీరేంచేస్తూం టారో చెప్తారా" అతడు అడిగాడు. యజమాని కు తుర్చిి ఆ ప్రశ్న అడుగు తున్నానన్న జంకుగాని భయంగాని ఆ గొంతులో లేవు. ఒకపై అధికారి అడిగి నట్టుగా ఉంది అంతే. స్వప్న చెప్పింది.

"థాంక్స్, అన్నీ కూలంకషంగా పరిశీలించి డిపార్టు మెంట్ని రీ ఆర్గ నైజ్ చేద్దామనుకుంటున్నాను, ఆ పునర్విభజనలో మీ అభిరుచికి తగ్గ పని ఇవ్వ డానికి ప్రయత్నిస్తాను" అన్నాడతను వచ్చిన మొదటి రోజే అతను ఆఫీసు పట్ల తీసుకుంటున్న శ్రద్ధకి ముగ్ధురాలైంది స్వప్న.

"మీరు వెళ్ళొచ్చు" అన్నాడతను.

స్వప్న వచ్చేసింది. అతని దగ్గర కెళ్ళాలంటేనే ఎందుకో జంకుగా ఉంది. అయితే అక్కడున్నంత సేపు ఎంతో మర్యాదగా ఉంటాడు. ఇంకా కాసేపు ఉండాలనిపిస్తుంది అవసరమైనదానికన్నా ఒక్క నిముషంకూడా ఎక్కువ మాట్లా డని అతనంటే ఆమెకి ఎంతో గౌరవం కలిగింది.

ప్రకాష్ ప్రవీణ్ గురించి తెలుసుకున్నాడు అందరూ అతనంటే భయ పడడం గురించి తెలుసుకున్నాడు. అయితే అంత స్ట్రిక్ట్గా వుండే అతనికన్నా తనంటేనే అందరూ ఎక్కువ ఇష్టపడతారన్న ధీమాగా ఉన్నాడు.

ప్రవీణ్ అక్కడచేరి వారంరోజులైంది. ఈలోగా అందరి సమస్యల్ని అవ గాహన చేసుకుని ఒక్కొక్క దాన్ని పరిష్కరించడం మొదలుపెట్టాడు. తన సమ స్యలు పరిష్కరించబడ్డంతో అందరికీ సంతోషం కలిగింది, ఇంతకు ముందులా ఎవరికి వారు నిర్ణయాలు తీసుకోకుండా వారానికి అందరూ ఓసారి కలిసి సమ

న్యల్ని పరిశీలించి, చర్చించి అందరికీ ఆమోదయోగ్యంగా ఉండేటట్టు నిర్ణయాల జరిగేలా ఏర్పాటు చేశారు దాంతో అందరికీ ఇంతకు ముందులా తమ నిర్ణయాలకి తామే బాధ్యత వహించాల్సి వస్తుందన్న జంకు, ఎక్కడ పొరపాటు జరుగుతుందో అన్న భయం పోయాయి. ఏదేనా అనుమానంవస్తే సంప్రదించడానికి ఓ మనిషి వున్నాడన్న ధైర్యం కలిగింది క్రమక్రమంగా అందర్నీ ఆకర్షించడం మొదలెట్టాడు ప్రవీణ్.

స్వప్నని పిలిచాడు-

అడ్వర్టయిజ్‌మెంట్‌లో జరుగుతున్న పొరపాట్లు గురించి చెప్పాడు. ఇతర కంపెనీల్లో, ఇతర దేశాల్లో అడ్వర్టయిజ్‌మెంట్‌కి ఎంత ప్రాముఖ్యత నిస్తారో, దాంట్లో ఏ ఏ విధానాలని అనుసరిస్తారో వివరంగా చెప్పాడు తమ ప్రకటనలు జనరంజకంగా ఉండేటట్లు ఎలా మార్చాలో చెప్పాడు బిజినెస్ మీద అతనికున్న అవగాహనకి, సమస్యని అతను అర్థం చేసుకునే తీరుకి, విషయాలని విశ్లేషించే పద్ధతికీ ఆశ్చర్యపోయింది స్వప్న.

"మనమూ అలాగే చేద్దాం" అంది

"మీకు తెలియదని కాదు, నాకు తెలిసింది చెప్పాను మీరు ఆలోచించి చెప్పండి మనం ఇద్దరం కలిసి పథకం రూపొందిద్దాం. ఏజెన్సీలకి చెప్పి అమలు పరుద్దాం"

"సరే" తలూపిన ఆమె ముద్దుగా అనిపించింది క్షణం పాటు వివశుడయ్యాడు ప్రవీణ్. ఆమె తొందరగా వెళ్ళిపోతే బాగుండుననిపించింది.

"థాంక్స్" ఆమె వెళ్ళిపోయింది.

స్వప్నకి రోజురోజుకి అతని పట్ల గౌరవం పెరుగుతోంది దాన్ని ప్రవీణ్ గమనించిన పోలేదు. గొప్పింటి పిల్లలకి 'ఇగో' (అహంభావ) ఉంటుందని, వాళ్లుకూడా అలా ఉన్న వాళ్ళనే ఇష్టపడతారని అతనికి తెలుసు అందువల్ల బెట్టుని ప్రవర్తించాడు. తనకి కావలసింది స్వప్న మాత్రమే కాదు ఆనందరావు గారి కంపెనీకి వారసత్వం ఈ రెండిటికి పోటీయే వస్తే అతను కంపెనీకి వారసత్వాన్నే ఎన్నుకుంటాడు.

(సశేషం)

Edited & Published by V. Leelavathy, Raghavaiah. at 1-8-519/11 Chikkadpally, Hyd-20. & Printed by P. Ramakrishna at Raghava Printers 1-8-4/1/1. Chikkadpalli. Hyderabad-20

# రంగులు పొంగారే
# ఆప్కో వస్త్రాలతో ఐశ్వర్యానికి
# రమణీయ స్వాగతం పలకండి!



పండుగలకు ప్రారంభోత్సవం
చేస్తుంది వినాయక చతుర్థి.
సకల సంపదలూ సమకూర్చే దైవానికి
ఇష్టమైన ఆప్కో వస్త్రాలతో అఖండ స్వాగతమీయండి!
మీకోసం ప్రత్యేకంగా నేసిన మంగళప్రదమైన చేనేత
చీరలు, షర్టింగులు, దుస్తులు, గృహాలంకరణ వస్త్రాలు
మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాయి! ఆహ్వానం
అందుకోండి! నచ్చినవాటిని ఎన్నుకోండి.

ఆప్కో
చేనేతలు

